కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-59 మార్చి 2013

**మూలం:** **http://kottapalli.in/2013/3/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం 'సంతోషం':** శివరాంప్రసాద్

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

**వెల:రూ.25/-**



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

**ఫోను: 08559 240222, 7702877670 ఇ-మెయిలు: team@kottapalli.in**




# విషయ సూచిక

# ఈ ఒక్కటీ వద్దు!

ఈసారి కథ, పెద్దపిల్లల కోసం-

అనగా అనగా ఒక వైద్యుడు ఉండేవాడు.

ఆయన చాలా భక్తిపరుడు, తాత్విక చింతన కలవాడు. దేనికీ పెద్ద చలించేవాడు కాదు- ఏం జరిగినా "పర్లేదులే" అనుకొని పోతూ ఉండేవాడు.

వైద్యుడిగా ఆయనకి మంచిపేరే ఉండేది. రకరకాలవాళ్ళు ఆయన దగ్గరికి వచ్చి వైద్యం చేయించుకునేవాళ్ళు. పేదవాళ్ళు, ధనికులు, మధ్యతరగతివాళ్ళు- ఇట్లా ఎవరొచ్చినా అందరినీ సమంగా చూసేవాడాయన.

అయితే ఒకసారి ఒక దొంగల నాయకుడికి చికిత్స అవసరమైంది. కొంచెం అనుమానిస్తూనే అతను ఈ వైద్యుడిని సంప్రతించాడు. అతని శరీరమూ అందరి శరీరాల లాంటిదే కదా! వైద్యుడు చికిత్స చేశాడు. దొంగల నాయకుడి ఆరోగ్యం మెరుగైంది. వైద్యుడిమీద గురి కుదిరింది. అప్పటినుండి అతనూ అతని అనుచరులు అందరూ కూడా వైద్యుడి అభిమానులైపోయారు. దొంగల గుంపులో ఎవరికి బాగాలేకపోయినా నిస్సంకోచంగా ఈ వైద్యుడి దగ్గరికి రావటం మొదలుపెట్టారు. వైద్యుడికీ ఇది బాగానే ఉన్నది- దొంగలు ఆయనకి బాగానే డబ్బులు ఇస్తున్నారు మరి!

అంతా బాగా జరిగిపోతున్నది అనుకునేంతలోనే అకస్మాత్తుగా రాజభటులు వచ్చి వైద్యుడిని బంధించారు. 'వైద్యుడి వేషంలో ఉన్న దొంగల నాయకుడివి నువ్వే! రాజుగారి ఖజానాని కొల్లగొట్టటానికి పథకం వేశారు మీరంతా కలిసి!' అన్నారు.

మామూలువాళ్ళయితే మొత్తుకునేవాళ్ళు, కాళ్ళావేళ్ళా పడే వాళ్ళు. కానీ వైద్యుడు ఏడవలేదు; మొత్తుకోలేదు. "నాకేం తెలీదు. నేను కేవలం వైద్యుడిని. దొంగలకూ- వాళ్ల పథకాలకూ నాకేం

సంబంధం లేదు" అని ఊరుకున్నాడు.

'కనీసం బాధకూడా పడటం లేదు. నిజంగా వీడే దొంగల నాయకుడు!' అనుకున్నారు భటులు.

దేశాచారం ప్రకారం వైద్యుడిని న్యాయసభ ముందు ప్రవేశపెట్టారు. అప్పటికీ వైద్యుడు చలించలేదు. న్యాయాధికారులు ఆయన్ని రకరకాలుగా ప్రశ్నించారు. దేనికీ సరైన- అంటే వాళ్లకి నచ్చే-సమాధానం రాలేదు. 'ఎంత గుండెలు తీసిన బంటో చూడండి, దొరికిపోయాక కూడా నేరం ఒప్పుకోవట్లేదు! అసలు మన దేశంలో శిక్షల్ని బాగా పెంచాలి' అనుకున్నారు అందరూ. వైద్యుడికి మరణశిక్ష విధించారు.

అయినా వైద్యుడు ఏడవలేదు: 'మీ భార్యా బిడ్డలు ఎలా బ్రతుకుతారు?' అని అడిగితే 'నారు పోసిన దేవుడే నీరు పోస్తాడు' అన్నాడు.

అనుమానం కొద్దీ రాజుగారు అతని మరణశిక్షను ఐదేళ్ళపాటు వాయిదా వేస్తూ వచ్చాడు. మొదట్లో చెప్పిన సంగతులు తప్ప ఇతను వేరే చెప్పింది లేదు. అయినా ఆ సరికి ప్రజల్లో అతని పట్ల అనుమానం పాదుకొని పోయింది: 'వైద్యుడి ముసుగులో ఖజానాని కొల్లగొట్టేందుకు పన్నాగం పన్నాడు చూడు! అతన్ని ఉరితీయాల్సిందే' అని కొందరు ప్రదర్శనలు కూడా చేయటం మొదలుపెట్టారు.

కానీ వైద్యుడి పద్ధతి చూస్తే- "అతను దొంగ కాదేమో అనిపిస్తున్నది.. అయినా న్యాయం ముందు వ్యక్తిగత అభిప్రాయానికి, అనిపించటానికి విలువలేదు" అనుకున్న రాజుగారు వైద్యుడి శిక్షను అమలు చేయించారు.

ఆ తర్వాత తెలిసింది అందరికీ- "ఈయన మామూలు వైద్యుడే; దొంగలు-దొంగలనాయకులు వేరే ఉన్నారు" అని. అందరూ నాలుకలు కరుచుకున్నారు. కానీ ఇప్పుడు ఎవరు ఏం చేయగలరు?!

అటు దొంగల ప్రాణం కూడా చివుక్కుమన్నది. వాళ్లంతా కలిసి అన్యాయంగా చనిపోయిన వైద్యుడి

పేరిట దేశంలో అంతటా అల్లర్లు సృష్టించటం మొదలుపెట్టారు. రాజుగారు తలపట్టుకున్నారు.

'శిక్షలు నేరస్తులలో పరివర్తన తెచ్చేవిలా ఉండాలి' అన్నది ఆధునిక శిక్షాస్మృతుల మౌలిక సూత్రం. మరణశిక్ష అమలు చేసిన తర్వాత 'పరివర్తన' అనేది ఎలా వస్తుంది? అందుకని ఇప్పుడు అనేక దేశాలు వేటికవి మరణశిక్షను రద్దు చేద్దామని ఆలోచిస్తున్నాయి. "పెద్దనేరాలకు కూడా వేరే శిక్షలేవైనా ఆలోచిద్దాంలే; ఈ మరణశిక్ష ఒక్కటీ వద్దు. దీన్ని రద్దు చేద్దాం!" అనుకుంటున్నాయి.

మనమూ ఆలోచించాలి. పెద్దవాళ్లం అవుతాంగా, రేపు?!

-కొత్తపల్లి బృందం

నవ్వండి!

**ఏం తెలివి!**

టీచరుగారు: రాజూ చరిత్ర గురించి నీకు తెలిసింది చెప్పు!

రాజు: ' గతం గత: ' వదిలెయ్యండి టీచర్!

**గొడుగు నానితే ఎలా?**

రాజు: వర్షంలో తడుస్తావేమో, గొడుగు పట్టుకెళ్ళు.

పిసినారి నాన్న: అదేం తెలివిరా! కొత్తగొడుగు నాని పోదూ!?

**ఇంగ్లీషు జోకు!**

రవి: సార్! 'యూ ఆర్ ఎ ఫూల్' అంటే ఏంటి సార్?

టీచరుగారు: నువ్వొక పనికి మాలిన వెధవ్వి.

రవి: చెప్పటం ఇష్టం లేకపోతే చెప్పకండి సార్! ఊరికే ఎందుకు తిడతారు?

**నమలండి!**

తండ్రి: ఏరా, అన్నం నములుతూ అంకెలు లెక్క పెడుతున్నావేమి?

వెంగళప్ప: అన్నాన్ని ఒకేసారి మింగద్దు; పదిసార్లు నమిలి మ్రింగు అని మీరే చెప్పారు కదండీ!

*-కె. దామోదర్, 8A, జవహర్ నవోదయ విద్యాలయ, లేపాక్షి*



# నీతి చంద్రిక

విగ్రహం(యుద్ధం)-16

*జరిగిన కథ: జరిగిన కథ: నెమలి, హంస రాజుల మధ్య యుద్ధం మొదలవుతున్నది. హంసరాజు రహస్యంగా పంపిన కాకి ఒకటి నెమలి విశ్వాసం చూరగొని ఉన్నది. మంత్రి అరుణముఖుడికి ఆ కాకిపైన అనుమానం. అది హంసకు 'కాకిని నమ్మి చచ్చిపోయిన గుడ్లగూబల కథ' చెబుతున్నది. ఇక చదవండి- నీతి చంద్రిక -40 వ భాగం.*

*మూలం: కీ.శే. కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ.*

అనగా అనగా దండకారణ్యం అనే అడవి ఒకటి ఉండేది. దట్టమైన ఆ అడవిలో పులులు, సింహాలు, ఏనుగులు, ఖడ్గమృగాలు లాంటి జంతువులెన్నో నివసిస్తూ ఉండేవి.ఆ అడవి మధ్యలో ఓ పెద్ద మర్రి చెట్టు ఉండేది. లెక్కలేనన్ని పండ్లతోటీ, పచ్చని ఆకులతోటీ గొప్ప స్థలాన్ని ఆక్రమించుకొని ఉండేదది. అది ఆకాశం అంత ఎత్తుగా నిల్చొని ఉంటే, దానిముందు తోటి చెట్లన్నీ మరుగుజ్జుల్లాగా కనబడేవి. 'వాటితో పోటీ పెట్టుకొని ఇది ఇంత

ఎత్తుకు ఎదిగిందేమో' అనిపించేది. దాని కొమ్మలు నాలుగు దిక్కుల్లోనూ ఎంతో దూరం విస్తరించి ఉండేవి. ఇక ఆ కొమ్మలమీద ఉన్న రకరకాల పక్షుల కిలకిలారావాలు వింటే 'ఓడిపోయిన ఆ తోటి చెట్లను చూసి ఇవన్నీ ఎగతాళి చేస్తున్నాయేమో, కిలకిలా నవ్వుతున్నాయేమో' అనిపించేది.

ఆ మర్రి చెట్టులో ఒక ప్రక్కగా నివసించేవి- మహా భయంకరాలైన కాకి మూకలు. ఆ గుంపులన్నిటికీ రాజు 'మేఘవర్ణుడు' అనే కాకి. చెట్టు మీద ఉండే లెక్కలేనన్ని కాకులు తనని కొలుస్తూ ఉంటే, మేఘవర్ణుడు 'అపర గరుత్మంతుడేమో' అన్నట్లు గొప్పగా కనబడేది.

మర్రి చెట్టుకు దగ్గరలోనే ఒక చక్కని కొండ గుహ ఉండేది. చీకటి గుయ్యారంగా ఉండే ఆ గుహలో చాలా గుడ్లగూబలు, తరతరాలుగా నివసిస్తూ ఉండేవి. వాటికి నాయకుడు- 'ఉపమన్యుడు' అనే గుడ్లగూబ. ఉపమన్యుడిని చూస్తేచాలు- గుడ్లగూబల శత్రువులన్నీ వణికిపోయేవి.

ఒకనాటి రాత్రి ఉపమన్యుడు ఎప్పటిలాగానే తన మంత్రి గూబలతో సమావేశం అయినప్పుడు దానికేదోఆలోచన వచ్చింది. అప్పటికప్పుడు అది తన సేనానిని అక్కడికి రప్పించి, దానికి ఉత్సాహం-ఆవేశం కలిగేటట్లు గొప్పగా మాట్లాడింది. దాంతో ఆ సేనానికి వీరావేశం వచ్చింది; కొమ్ములు మొలిచినట్లయింది. లెక్కలేనన్ని గుడ్లగూబల సైన్యాన్ని వెంటబెట్టుకొని, భీకరమైన అరుపులు ఆకాశాన్ని అంటుతుండగా అది కదిలి, తమ విరోధులైన కాకులు నివసించే మర్రి చెట్టును చుట్టుముట్టింది.



ఆ సమయానికి కాకులన్నీ నిద్రబారిన కళ్ళతో, ఒళ్ళుమరిచి కూరుకుతూ ఉన్నాయి. వాటిని

ఆ స్థితిలో చూసేసరికి గుడ్లగూబలకు ఎక్కడలేని సంతోషం కలిగింది; దాంతోబాటు విపరీతమైన కోపం కూడా వచ్చింది. అవన్నీ కాకులతో తలబడి యుద్ధం మొదలు పెట్టాయి. కొమ్మల్లో ఎక్కడెక్కడో దాక్కున్న కాకులను వెతికి పట్టుకొని, వాడి గోళ్లతో గీకి, తీక్షణమైన ముక్కు కొనలతో పొడిచి, గట్టిగా అట్టలుకట్టి ఉండే రెక్కల అంచులతో చరచి, కొన్నిటి రెక్కలు విరిచేశాయి; కొన్నిటి ప్రక్కటెముకలు ముక్కలు చేశాయి; కొన్నిటి ముక్కులు చెక్కలు చేశాయి- కొద్దిసేపట్లోనే లెక్కలేనన్ని కాకుల్ని చంపి యమపురికి పయనం కట్టించాయి. అంతవరకూ నల్లటి కాకులతో చీకటి క్రమ్మినట్లున్న ఆ మర్రిచెట్టు ఒక్కసారిగా తెరచుకొని వెలుగులో మునిగినట్లయింది. దాన్ని చూసిన ఉపమర్దనుడి సర్వాంగాలూ సంతోషంతో పులకించి పోయాయి. కోరిక తీరిన సంతోషంతో దాని కళ్ళు మరింతగా వికసించాయి.

గుడ్లగూబలు విజయోత్సాహంతో చేసిన కోలాహలంతో భూమి మీద ఉన్న జంతువులన్నిటి చెవులూ ఒక్కసారిగా దద్దరిల్లిపోయినట్లయింది. అట్లా యుద్ధంలో సునాయాసంగా గెలిచి, ఉపమర్దనుడు పరివారంతో సహా అట్టహాసంగా తమ కొండ గుహకు చేరుకున్నది.

ఇక అలా ఆ రాత్రి దాడి చేసిన గుడ్లగూబల చేత చిక్కకుండా ఎక్కడో ఒళ్ళు దాచుకొన్న మేఘవర్ణుడు, మరునాడు తెల్లవారాక మళ్ళీ మర్రిచెట్టు దగ్గరికి ఎగిరి వచ్చి చూసుకున్నది. ఒళ్ళుమరచి నిశ్చింతగా గూళ్లలో నిద్రపోతున్న తన వారిపైన అకస్మాత్తుగా విరుచుకు పడిన అకాల ప్రళయం ఏం చేసిందో కళ్ళారా చూసేసరికి దాని గుండెలు పగిలినట్లయింది. దు:ఖంతో అది చాలా సేపు నిశ్చేష్టమైపోయింది. తెలివి వచ్చాక చనిపోయిన తన పిల్లల్నీ, బంధువుల్నీ, మిత్రుల్నీ పేరు పేరునా, వరస వరసనా తలచుకొని నిట్టూర్పులు వదలుతూ, ఏడిచిందది.

ఇక దాని మాదిరే రాత్రి గుడ్లగూబల పాల పడక

తప్పించుకొని, ఎక్కడెక్కడో దాక్కున్న కొన్ని కాకులు కూడా ఒకచోట చేరాయి. తమ రాజు మేఘవర్ణుడు ఇంకా ప్రాణాలతోటే ఉన్నదని తెలుసుకొనే సరికి వాటికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. అవి అన్నీ కలిసి గుంపుగా మళ్ళీ ఓసారి తమ నివాసమైన మర్రిచెట్టు దగ్గరకు చేరుకున్నాయి. నాశనమైపోయిన తమ గూళ్లను చూసేసరికి వాటికి దు:ఖం ఆగలేదు.



అవన్నీ కంటికి-నేలకు ఏకధారగా ఏడుస్తూ తమ రాజుతో "ప్రభూ! తెల్లవారాక మళ్ళీ తమరి పాదాలను ఈ విధంగా దర్శించుకుంటామనుకోలేదు. మా పూర్వ పుణ్యం ఫలించింది; తమరు భద్రంగా ఉన్నారు. వెయ్యి నక్షత్రాలున్నా చంద్రుడు లేని రాత్రి శోభించని తీరున, వెయ్యిమంది ప్రజలున్నా సరే, రాజులేని రాజ్యం నిండుగా ఉండదు;చీకటితో మూసుకుపోయినట్లు ఉంటుంది. దేవుడు చల్లగా చూడబట్టి, తమరు-మేము కూడా ప్రాణాలతో మళ్ళీ ఈ భూమిపైన అడుగుపెట్టగలిగాము.

ఆ దేవుడు కూడా పగవారి పక్షమే వహించి మనకు ఎంత కీడు చేశాడో చూడండి! అయినా తప్పకుండా జరగవలసిన దానిని తప్పించటం ఎవరికి సాధ్యం?! ఎలాంటి కారణమూ లేకుండానే మీవంటి ధర్మాత్ములకు చేసిన కీడు, క్రూరకర్ములైన ఆ గుడ్లగూబలను ఊరికే వదలదు.

ఈ సమయంలో మనకు కాలం అనుకూలించటం లేదు- కాలాన్ని మీరి నడవటం ఎవరికి సాధ్యం? మన బంధువులు- గొప్ప గొప్ప పేరుగల కాకులు కూడా, కాలం తీరే సరికి నిద్రావశాలై పోయినై; పగటిపూట కళ్ళు ఆనని ఆ అనామకపు గుడ్డి గుడ్లగూబల పాలబడి ప్రాణాలు కోల్పోయినై.

అయినా మనకు ఎదురైన కష్టం దైవ వైపరీత్యం అయినప్పుడు బాధపడవలసిన అవసరం లేదు. మేం అప్పుడే అలసిపోయి, కొంచెం

కన్ను మూశాం అంతే- అంతలో అకస్మాత్తుగా లెక్కలేనన్ని శత్రుమూకలు వచ్చి, మేం ఇంకా కళ్ళు తెరవకనే వీళ్ల గొంతులు కోసి పోయినై. మేమే మేలుకొని ఉంటే మీ సేవకులను ఇట్లా చేసినవాడు ఒక్కడైనా తప్పించుకొని పోగలిగేవాడా? ఇప్పుడెందుకో మా దురదృష్టం కొద్దీ పరాభవం పాలయ్యాం కానీ, ఇంతకు ముందెన్నడూ ఇట్లా అయినవాళ్లం కాదు. శూరవీరులైన తమంతటివారికీ ఈ పరాభవం తప్పలేదు చూడండి. ఇదంతా మా రాత కాబోలు. శత్రువులు మనల్ని యుద్ధంలో బాధించినందుకు దిగులు చెందకండి. 'పెరుగుట విరుగుటకొరకే' అని చెబుతారు పెద్దలు. ఇవాళ్ళ 'శత్రువులను ఓడించాను' అని విర్రవీగే పగవాడికి రేపు ఏమి మూడనున్నదో, ఎవరికి తెలుసు? ఇంతకాలమూ మమ్మల్ని కంటికి రెప్పలాగా కాచిన తమరిని తలచుకొని, 'తమరే మా కంటి వెలుగు' అని మీ వెంట ఉండేందుకే మేం అందరం మీ పాదాల చెంతకు చేరుకున్నాం. మీవంటి గొప్పవారి కరుణ మా మీద ప్రసరిస్తేనే కదా, మా మనసుల్లోని తాపం చల్లారేది?! "ఈతకు ఎక్కువ లోతు లేదు- కాబట్టి సాహసిద్దాం; ప్రజలు మనల్ని విమర్శించేందుకు తావివ్వకుండా, ఆయువు తీరిపోయేంతవరకూ పోరాడదాం.. మన కాలం మంచిదైనప్పుడు ముందుకు పోయి యుద్ధం చేద్దాం, శత్రువును మట్టుపెట్టుదాం. లేకపోతే, శత్రువు బలవంతుడు కనుక, 'మన భాగ్యం ఇంతే' అనుకొని వారినే ఆశ్రయించుకొని బ్రతుకుదాం.. లేదా, ఇప్పటికి దూరదేశం ఎక్కడికైనా వలసపోయి, శత్రువులకు అసాధ్యమైన కోటను ఒకదాన్ని సంపాదించుకుందాం.. లేదా బలవంతుడైన మిత్రుల సహాయంతో శత్రువును సునాయాసంగా ఓడిద్దాం.." అంటూ రకరకాలుగా అనసాగాయి.

అప్పుడు వాటి కలకలాన్నంతా సద్దుమణిగేలా చేసి, 'చిరంజీవి' అనే మంత్రి ఇట్లా అన్నది- "ప్రభూ! తమరి అమాత్యులు అందరూ సమర్థులు. దు:ఖం వల్ల తమ మనసుకు సమాధానం లేక, ఇప్పుడు పలువిధాలుగా

ఆలోచిస్తున్నట్లున్నారు కానీ, నిజానికి తమరికి తోచని అంశాలేమున్నాయి? అది అటుంచండి, తమరునన్ను కూడా ఒక మంత్రిగా ఆదరిస్తున్నారు కనుక, దేవరవారి ఆజ్ఞ అయితే, నాకు తోచిన ఉపాయం ఒకటి నేనూ విన్నవించుకుంటాను- యుద్ధంలో గరుత్మంతుడినైనా ఎదిరించగల శూరులను చాలా మందిని కోల్పోయి, కోరలు పీకిన పాములలాగా భంగపడి ఉన్నాం. ఈ సమయం మనకు అనుకూలంగా లేదు; శత్రువును ఓడించేందుకు మనకున్న శక్తి చాలదు. తగిన సమయం వచ్చేవరకూ శత్రువు మీద కన్ను వేసి ఉంచుదాం; దగ్గరలో లేనట్లే ఉందాం; కొంగ మాదిరి శత్రువును ఒక్కసారిగా గుటుక్కున మ్రింగుదాం. అప్పటివరకూ ఏదో ఒకవిధంగా శత్రువును గమనించటం అవసరం అని నా అభిప్రాయం. పగవాడు చాలా పొగరు మీద ఉన్నాడు కదా, మనం వాడిని ఎట్లా గమనించగలం అని ఆలోచించకండి- తమరి ఆజ్ఞ అయితే, ఆ బలంతోటీ, వీరందరికీ నామీద గల నమ్మకంతోటీ, నేను పోయి, ఎంత దుష్కరమైన పనినైనా సాధించుకొని రాగలను. అయితే కొంచెం శ్రమ పడి మీరంతా నాకొక సాయం చేయాలి- దగ్గరలో అంతటా వెతికి కొంచెం రక్తం సంపాదించుకొని రండి. నామీద చల్లి, నా శరీరాన్ని రక్తసిక్తం చేయండి. ఇక అటుపైన ఆలస్యం చేయకుండా 'ఋశ్య శృంగం' అనే కొండకొమ్మును చేరుకోండి. భారం అంతానామీద విడిచిపెట్టి, మీరంగా అక్కడ నిశ్చింతగా సుఖంగా ఉండండి. మన పగ నెరవేర్చి మేలు కూర్చే పూచీ నాది!" అన్నది.

కాకులన్నీ సంతోషించి, అప్పటికప్పుడు సందుగొందుల్లో అంతటా వెతికి ఎలుకలు మొదలైన చిన్న జంతువులను చంపి, వాటి రక్తాన్ని తెచ్చి చిరంజీవికి పూసినై. అటుపైన అవన్నీ భారాన్ని దానిపైనే విడచి, ఎగిరి ఋష్యశృంగానికి పోయినై. (తర్వాత ఏమైందో వచ్చేసారి చూద్దాం...) ✸

తల్లిదండ్రులందు దయలేని పుత్రుండు- పుట్టనేమి, వాడు గిట్టనేమి?




# దెబ్బకు ఏడు ప్రాణాలు!

*కథనం:Ch. అనూష, పదవ తరగతి, నందన గ్రామీణ పాఠశాల, చేతన, చౌడవరం, గుంటూరు జిల్లా.*

మార్కాపురంలో ఉండే రాముకు బెల్లపు లడ్లంటే చాలా ఇష్టం. ఒకరోజు వాడు బడినుండి ఇంటికి వచ్చేసరికి ఎదురుగా బెల్లపు లడ్డు కనిపించాయి.

మహదానందంతో లడ్లమీదికి దాడి చేశాడు వాడు. ఒక లడ్డూ తిని ఇంకో లడ్డు కోసం చెయ్యి చాపేసరికి- కనబడ్డాయి... లడ్డూల పళ్ళెంలో చాలా ఈగలు వాలి ఉన్నాయి- జుయ్ జుయ్ మని శబ్దం చేసుకుంటూ ఎగిరెగిరి నాకుతున్నాయి లడ్డూలని!

వాటిని చూస్తే కంపరం పుట్టింది రాముకు. పళ్ళెం మీద ఒక చేతిని నిలిపి, రెండో చేత్తో 'ఠాప్' మని చప్పట్లు కొట్టినట్లు చరిచాడు.

చేతులు విప్పి చూసుకుంటే ఒకటి కాదు- రెండు కాదు- ఏకంగా ఏడు ఈగలు చచ్చి అతుక్కొని ఉన్నాయి, చేతిలో!

'ఒక్క దెబ్బకు ఏడు ప్రాణాలు! ఒక్క దెబ్బకు

ఏడు ప్రాణాలు!' అని అనుకున్నకొద్దీ రాముకి ఉత్సాహం ఎక్కువైంది.

తను చేసిన ఘన కార్యం గురించి అందరికీ చెప్పుకోవాలని మోజు పుట్టింది వాడికి. దాంతో వాడు ఊళ్ళోకి పోయి, దర్జీ చేత ఒక పట్టీ కుట్టించుకున్నాడు- దానిమీద 'దెబ్బకు ఏడు ప్రాణాలు!' అని పెద్ద అక్షరాలతో రాయించుకున్నాడు. ఆ పట్టీని పటకాలాగా నడుము చుట్టూ కట్టుకొని, అట్లా లడ్డూలు తింటూ కులాసాగా ఊరి చివరికంటా వెళ్ళొద్దామని బయలు దేరాడు.

ఊరి చివర్లోనే చక్కని అడవి. రాముడు అడవిలో కొద్ది దూరం నడిచాడో లేదో, 'ఆగు' అని అరుస్తూ వాడి ముందు ప్రత్యక్షం అయ్యాడు, ఒక రాక్షసుడు. రాము ఒక క్షణం భయపడ్డాడు. కానీ అంతలోనే వాడికి తన నడుముకు ఉన్న పటకా గుర్తుకొచ్చి, చాలా ధైర్యం అనిపించింది.

వాడు నిటారుగా నిలబడి 'ఏంరా, ఒరే! దెబ్బకు ఏడు ప్రాణాలు అంటే ఏంటో నీకూ తెలీలేదా?! వివరించాలా? ఒక్క దెబ్బ చాలు, అంతే!' అన్నాడు, చేత్తో పటకా కేసి చూపిస్తూ.

రాక్షసుడు రాము నడుం చుట్టూ ఉన్న పటకా కేసి చూసి, కొంచెం బిత్తరపోయాడు. అయితే వెంటనే తేరుకొని, 'నీ బలం చూపించురా, నమూనాకు ఇదిగో- నా బలం ఎంతటిదో చూపిస్తాను చూడు' అని ఒక రాయిని తీసుకొని నలిపేసాడు. అది పొడి పొడి అయిపోయి రాలిపోయింది.



రాము గట్టిగా నవ్వి, తన జేబులోంచి ఓ బెల్లపు ఉండను బయటికి తీసి దాన్ని ఒంటి చేత్తో నలిపేసాడు. అది కూడా పిండి పిండి అయిపోయింది- అంతే కాదు; దానిలోంచి

ఒక చుక్క నూనె కూడా కారింది!

రాము నలిపేసింది రాయినే అనుకున్నాడు రాక్షసుడు. రాతిలోంచి నూనెను పిండిన రాముని చూసి వాడి వెన్నెముకలోంచి వణుకు పుట్టుకొచ్చింది. వాడు గబుక్కున రాము చెయ్యి పట్టుకొని ఊపుతూ, 'బలే బలవంతుడివోయ్, నువ్వు! నా పేరు ఏకదంతం. నువ్వు నాకు నచ్చావు. నాతో పాటు రా, మా యింటికి! అక్కడ మా తమ్ముడు ద్వేదంతం ఉన్నాడు. వాడికి కూడానిన్ను పరిచయం చేస్తాను. రా, మాయింటికి పోదాం!' అని వాడిని దొరకపుచ్చుకొని తమ గుహకు తీసుకెళ్ళాడు.

రాముకి వాడితో వెళ్ళటం అస్సలు ఇష్టం కాలేదు- కానీ ఏం చేస్తాడు, ఏకదంతం వాడి చేతిని బిగించి పట్టుకొని లాక్కుపో-యాడాయె!

అక్కడికి వెళ్ళేసరికి ద్వేదంతం ఏదో వండుతున్నాడు. ఇక రాముకీ వాళ్ళిద్దరితోబాటు తినటం, అక్కడే పడుకోవటం తప్పలేదు. "సరేలే, తెల్లవారగానే ఏదో ఒక సాకు చెప్పి తప్పించుకు పోవచ్చు' అని వాడు వాళ్ళు పెట్టిందేదో తినేసి, మంచం మీద నిగడ తన్నుకొని పడుకున్నాడు.

రాము పడుకోవటమైతే పడుకున్నాడు గానీ, భయంతో వాడికి ఎంతకీ నిద్ర పట్టలేదు. రాక్షసుల ముఖాలే వాడి కళ్ళముందు కదలాడుతూ ఉన్నాయి. దాంతో వాడు ఒక్కసారి లేచి, వాళ్ళిద్దరూ ఏం చేస్తున్నారో చూశాడు, కిటికీలోంచి.

ఆ సమయానికి ప్రక్క గదిలో రాక్షసులిద్దరూ మాట్లాడుకుంటున్నారు- 'ఒరే! మేలుకొని ఉండగా వీడిని ఏమీ చెయ్యలేం. కొంచెం సేపయ్యాక, గాఢ నిద్రలోకి జారతాడు గదా, అప్పుడు ఇనుప కడ్డీలతో వీడిని సఫా చేసేద్దాం' అని.

అది వినే సరికి రాము ఇక మళ్ళీ మంచం మీదికి ఎక్కలేకపోయాడు. దగ్గర్లో ఉన్న దిండులను తీసుకొచ్చి, వాటిని మంచం మీద వరసగా పేర్చి తను మంచం వెనకగా దాక్కున్నాడు.

అర్థరాత్రి దాటాక లోనికి వచ్చిన రాక్షసులు, నిండా దుప్పటి కప్పి ఉన్న దిండ్లను చూసి వాడే

అనుకున్నారు. తాము తెచ్చిన ఇనుప కడ్డీలతో మళ్ళీమళ్ళీ బాదారు దిండ్లని. చివరికి ఆ మంచం విరిగి రెండు ముక్కలయ్యేంత వరకూ బాదటం ఆపలేదు! ఒకసారి మంచం విరిగాక, 'కిక్కురుమనకుండా చచ్చాడురా, బలవంతుడట-బలవంతుడు!' అని ఈసడిస్తూ వెళ్ళి పడుకున్నారు.

తెల్లవారాక వాళ్ళిద్దరూ ఫలహారం మొదలుపెట్టేసమయానికి, నవ్వుతూ వచ్చి టేబుల్ ముందు కూర్చున్నాడు రాము- 'శుభోదయం అన్నలూ!' అంటూ. చచ్చిపోయాడనుకున్న రాము లేచి వచ్చేసరికి రాక్షసులిద్దరికీ ఆశ్చర్యమూ, భయమూ ఒకేసారి కలిగాయి.

'రా, రా తమ్ముడూ! రాత్రి బాగా నిద్ర పట్టిందా?' అన్నారు వాళ్ళు. 'పర్లేదు అన్నలూ! బానే పడుకున్నాను చాలా సేపు. కానీ మధ్యరాత్రి ఎక్కడినుండి వచ్చాయో గానీ రెండు ఎలుకలు వచ్చాయి- తోకలతో కొట్టి కొట్టి సతాయించాయి నన్ను. ఇంకొంచెం సేపుంటే వాటిని పట్టుకొని నలిపిపారేసి ఉండేవాడిని- బ్రతికి పోయాయి' అన్నాడు రాము నవ్వుతూ.

'బాబోయ్! వీడు మామూలు మనిషి కాదు. మాయం!' అని రాక్షసులిద్దరూ తటాలున మాయం అయిపోయారు.



రాము నవ్వుకుంటూ అక్కడున్న బంగారం అంతా తీసుకొని ఇల్లు చేరుకున్నాడు.

అయితే అట్లా అంత బంగారం కళ్ళ చూసే సరికి, వాడికి తన ధైర్యసాహసాలమీద మరింత గురి కుదిరింది. రాజుగారి దగ్గరికి వెళ్ళి తన ప్రతిభకు తగిన ప్రతిఫలం పొందాల్సిందేనని, వాడు ఇప్పుడు రాజధానికి

బయలుదేరిపోయాడు! రాజధానిలో వాడిని అడ్డగించబోయిన భటులందరికీ వాడు తన నడుముకున్న పటకానే చూపిస్తూ పోయాడు. 'అమ్మో! వీడెవడో వీర యోధుడల్లే ఉన్నాడు. దెబ్బకు ఏడు ప్రాణాలట! మనకెందుకు, రాజుగారి దగ్గరికే పంపుదాం' అని వాళ్లంతా వాడిని నేరుగా రాజుగారి దగ్గరికే పంపించారు.

ఆ సమయానికి రాజుగారు తల పట్టుకొని ఉన్నారు- రాజ్యంలోకి ఎవరో ఇద్దరు రాక్షసులు వచ్చి పడ్డారు. ప్రజల్ని నానా ఇబ్బందులూ పెడుతున్నారు. వాళ్లని ఎవరు- ఏం చేయాలో, ఎలా చెయ్యాలో తెలీటం లేదు.

"నువ్వెవరో తెలీదు...నిజంగా మహా యోధుడివా?! మా రాజ్యానికి ఈ రాక్షసుల బెడద తొలగించావంటే, నిన్ను మా దగ్గరే ఉంచుకొని చదివించి, పెద్దయ్యాక మా అమ్మాయినిచ్చి పెళ్ళి కూడా చేస్తాను. కాదూ, ఈ పని నీవల్ల అవ్వదంటే చెప్పు; ఆ పటకా తొలగించుకొని ఇంటికి పో. రాక్షసుల సంగతి నేనే చూసుకుంటాను" అన్నాడు రాజు, 'దెబ్బకు ఏడు ప్రాణాలు' అని చదివి.

రాముకి అభిమానం పొంగివచ్చింది. అదీకాక, వాడికి ఇప్పుడు రాక్షసులంటే భయం లేదుగా, అందుకని వాడు రాజుగారికి మాట ఇచ్చి బయలుదేరాడు. రాక్షసులిద్దరినీ వెతుక్కుంటూ పోయాడు.

అడవిలోకి వెళ్లగానే కనబడ్డారు ఏకదంతం, ద్వేదంతం. ఇద్దరూ ఓ మర్రి చెట్టు క్రింద కూర్చొని గమ్మత్తుగా మాట్లాడుకుంటూ ఉన్నారు.

రాము అక్కడున్న గులక రాళ్లను కొన్నిటిని ఏరి జేబులో వేసుకొని, మెల్లగా చెట్టెక్కి కూర్చున్నాడు. ముందుగా ఒక రాయిని గట్టిగా ఏకదంతం మీదికి విసిరాడు. ఏకదంతం ఒక్కసారి ఉలిక్కిపడి, ద్వేదంతం కేసి అనుమానంగా చూసి ఊరుకున్నాడు.

ఇప్పుడు రాము మరో రాయిని, మళ్ళీ ఏకదంతం మీదికి విసిరాడు. ఈసారి వాడు 'ఏమిరా, నీకేమయింది?! బుద్ధి ఎక్కడికో పోతున్నట్లున్నదే!?' అని గట్టిగా తిట్టాడు ద్వేదంతాన్ని.

చెట్టుమీదున్న రాము నవ్వుకొని, ఈసారి

రాయిని ద్వేదంతం మీదికి విసిరాడు. ద్వేదంతం చటుక్కున లేచి 'నేను నిన్ను ఏం చేసాను? అట్లా కొడతావెందుకు?!' అని ఏకదంతంతో కలబడ్డాడు.

అట్లా రాము ఇద్దర్నీ మార్చి మార్చి కొట్టటం, ఇద్దరూ ఒళ్ళు మరచిపోయేట్లు కొట్టుకోవటం జరిగాయి- చివరికి ఇద్దరూ కలిసి పైకి చూసేసరికి, కొమ్మల్లో ఇకిలిస్తూ కనబడ్డాడు రాము- "నేను రానా? నేను కొట్టనా?!" అని అడుగుతూ.

రాక్షసులిద్దరికీ గుండె జారిపోయినట్లయింది. "అన్నా! తమ్ముడూ! వీడు మనల్నే వెంబడిస్తున్నాడు! మాయం!" అని వాళ్ళిద్దరూ తటాలున మళ్ళీ అక్కడినుండి మాయం అయిపోయారు. ఈసారి ఇద్దరూ ఆ రాజ్యాన్నే విడిచిపెట్టి పారిపోయారు.

రాజుగారు రాముని గొప్పగా సత్కరించారు. ఏనుగుమీద కూర్చోబెట్టి ఊరేగించారు. రాముకి చాలా సంతోషం వేసింది. మనసు కొంచెం సేపు మబ్బుల్లో తేలిపోయింది... అంతలోనే వాడి ముఖం మీద నీళ్లు వచ్చి పడ్డాయి- "లేవరా, గాడిదా! రాణి, రాజు, సింహాసనం, ఏనుగులూ అన్నీ ఎక్కడివక్కడే ఉన్నాయిలే! లేచి వెంటనే పళ్ళుతోముకొని బడికి బయలుదేరలేదంటే నీకు ఇక్కడే స్నానం చేయించేస్తాను నేను" అంటూ మరో చెంబెడు నీళ్ళు వాడి ముఖం మీద చిలకరించబోయింది రాము వాళ్ళమ్మ!

చటుక్కున లేచిన రాము గబగబా స్నానాల గదిలోకి దూరాడు. పళ్ళు తోముకొని రాగానే అమ్మ వాడి చేతిలో ఓ బెల్లపు లడ్డూ పెట్టింది. "నేను తిన్నాగా?" అన్నాడు రాము. "ఎప్పుడు తిన్నావురా? నిన్న బడినుండి రాగానే పడుకొని మొద్దులాగా నిద్రే పోతివి. ఇప్పుడేగా, నిద్ర లేచింది!" అన్నది అమ్మ అనుమానంగా.

అప్పుడు అర్థమైంది రాముకి- "అమ్మా! తెల్లవారు జామున వచ్చిన కలలు నిజం అవుతాయా?" అడిగాడు.

"ఒరే, కలలేవీ నిజం కావురా! కరిగిపోతాయి! నిజం మటుకు నిప్పు- అది ఎప్పుడూ నిజంగానే ఉంటుంది." అంది అమ్మ.



# కోపం వచ్చిన చీమ

*ఈ కథ కొంచెం చీమ-మిడత కథ లాగే ఉంది, అయినా కథలో కొంచెం చాలానే మార్పులు చేసిందిగా, ఈ పాప!..చదవండి.*

*కథనం: యస్.కె.షర్మిల, తొమ్మిదవ తరగతి, అరవింద హైస్కూల్, కుంచనపల్లి, గుంటూరు జిల్లా.*

అనగనగా ఓ ఇంటి ఆవరణలో ఉండేవి- ఒక చీమ, ఒక దోమ, ఒక ఈగ. దోమ పాటలు పాడుతూ మొక్కల చుట్టూ, పొదల చుట్టూ, మనుషులచుట్టూ తిరుగుతుండేది. ఈగ ఎక్కడ ఆహారం కనబడితే అక్కడ, ఆ ఆహారం చుట్టూ గింగిరాలు కొడుతుండేది. చీమ మటుకు ఎక్కడెక్కడో పడి ఉన్న ధాన్యపు గింజలను ఏరి తన ఇంటికి మోసుకొని వెళ్తూ ఉండేది రోజంతా. దానికి ఆశ ఎక్కువని, ఎప్పుడూ ఆహారాన్ని సేకరించుకొని కూడబెడుతూనే ఉంటుందని ఈగ, దోమ ఆటపట్టిస్తూ ఉండేవి. కానీ చీమ మటుకు ఆ మాటల్ని పట్టించుకునేది కాదు. "నాకూ వస్తుంది అవకాశం. అప్పుడు చెబుతా, వీళ్ళ పని!" అని సరైన అవకాశం కోసం ఎదురుచూస్తుండేది.

ఒకసారి చీమకు ఎదురొచ్చింది ఈగ. చీమ ప్రక్కకు తప్పుకొని వెళ్ళబోయింది; కానీ దాన్ని ముందుకు పోనివ్వలేదు ఈగ. 'ఏయ్! చీమా! ఆగు! నీకన్నాపెద్దవాళ్ళు, గొప్పవాళ్ళు కనిపిస్తే నమస్కరించాలన్న కనీస జ్ఞానం కూడా లేదా, నీకు?' అన్నది చీమ దారికి అడ్డం వస్తూ.

చీమకు కోపం వచ్చింది. 'నువ్వు నాకంటే దేనిలో గొప్పవాడివోయ్?' అని అడిగింది ఈగను.



'నేను ఏ ఆహారాన్నయినా రుచి చూడగలను. ఏ చోటికైనా వెళ్లగలను. ఎవరూ నన్ను ఆపలేరు' జవాబిచ్చింది ఈగ, గర్వంగా.

'అవునవును. పిలువని పేరంటానికి వెళ్తుంటావు నువ్వు. అందరూ నిన్ను ఛీ కొడుతుంటారు. నువ్వూ, మీవాళ్ళూ అందరూ అసహ్యించుకునే పదార్థాలమీద కూడా వాలుతుంటారు. 'మీ రాక ఎన్నో అనారోగ్యాలకు మేలుకొలుపు' అని అందరూ భయపడుతుంటారు. రోగాలను ఒకరినుండి ఒకరికి చేర్చటంలో మీకు మీరే సాటి! కాస్త పక్కకు తప్పుకుంటే నా దారిన నేను వెళ్తాను. చాలా పని ఉంది' కోపంగా జవాబిచ్చి ముందుకు కదిలింది చీమ.

ఈగ గొంతులో పచ్చివెలక్కాయ పడ్డట్లు అయ్యింది. మౌనంగాప్రక్కకు తప్పుకున్నది.

కొంచెం దూరం వెళ్ళగానే దోమ ఎదురైంది చీమకు. 'ఏంటి చీమక్కా! కాసేపు తిండి యావ మానేసి, ప్రపంచం ఎంత అందంగా ఉందో, నీ చుట్టు ప్రక్కల వాళ్లు ఎంత సంతోషంగా జీవిస్తున్నారో చూడు, ఓసారి' అంది దోమ, చీమకు హితోపదేశం చేస్తున్నట్లు.

'నువ్వేనా, సంతోషంగా జీవిస్తున్నది?' అడిగింది చీమ, చిర్రెత్తుకురాగా.

'అవును! నేను ఎక్కడికి కావలిస్తే అక్కడికి ఎగిరి పోగలను. కావలసినంత రసాన్ని, రక్తాన్ని పీల్చగలను. రాజు గారిని కూడావేధించగలను' అంది దోమ.



'ఆ రాజుగారు అరచేతితో ఒక్కటిస్తే చావగలవు కూడాను, నువ్వు! దొంగచాటుగా మనుషుల రక్తాన్నీ, జంతువుల రక్తాన్నీ, మొక్కల రసాన్నీ పీల్చుకొని బ్రతికే పరాన్న జీవివి, రక్త పిపాసివి నువ్వు. గర్వపడకు. నాలాగా కష్టపడి సంపాదించింది తిను- స్వయం కృషితో సంపాదించిన ఆహారం ఎంత రుచిగా ఉంటుందో తెలుస్తుంది. అయినా కష్టపడి బ్రతికే కూలిదాన్ని నేను. రాక్షసులతోటీ, దొంగలతోటీ నాకు పనేమున్నది? అడ్డులే! పోనివ్వు!' అని ముందుకు కదిలింది చీమ. దోమ బిత్తరపోయి చూసింది.

తర్వాత వర్షాకాలం వచ్చింది.

కుండపోతగా వర్షం కురిసింది. దోమకు, ఈగకు ఆకలి ఎక్కువైంది. మనుషుల రక్తం పీల్చాలని పోయిన దోమ, విషపు వాసనలకు తట్టుకోలేక పోయింది. ఊపిరాడక చనిపోయింది. మనిషిని చికాకు పెట్టిన ఈగ కూడా అకాల మృత్యువు పాలైంది.

చీమ మాత్రం వెచ్చగా ఇంట్లోనే ఉండి, తను దాచుకున్న ఆహారాన్ని తింటూ సుఖంగా కాలం గడిపింది.

**పొడుపు కథలు!**

1. నల్లని అడవిలో తెల్లని దారి.. ఏంటది?
2. రెండు పళ్ళాలలో ఒక గారె... (తెలంగాణలో దొరికే ప్రత్యేకమైన అడవి పండు ఇది!) ఏంటో?



# పాల ధర పాలకు- నీళ్ళ ధర నీళ్ళకు

*'ప్యాకెట్ పాలు ఉంటాయిగా' అనుకోకండి- అవేవీ రాని పాత రోజుల నాటి కథ అన్నమాట, ఇది!*
*సేకరణ: పి. మైథిలి, 8 వ తరగతి, ప్రజ్ఞ ఇంగ్లీష్ మీడియం స్కూల్, అద్దంకి, ప్రకాశం జిల్లా*

గోవిందప్ప ఒక పాల వ్యాపారి. రోజూ పాలలో సగానికి సగం నీళ్ళు కలిపి అమ్మేవాడు అతను. ఊళ్ళో వాళ్ళు ఎవ్వరికీ ఈ నీళ్ళపాలు నచ్చేవి కావు. అయినా ఏం చేస్తారు, ఇంకెక్కడా పాలు దొరకవాయె! దాంతో తప్పని సరై కొనేవాళ్ళు; మనసులో తిట్టుకునేవాళ్ళు.

ఒక రోజున అతని దగ్గరికి ఓ సన్యాసి వచ్చి, గ్లాసెడు పాలు పోయించుకున్నాడు. గోవిందప్ప పోసిన నీళ్ళ పాలను చూసి, 'నాయనా, మరీ ఎక్కువ నీళ్ళు కలిసినట్లున్నాయి?' అన్నాడు. 'ఇక్కడి బర్రెలు ఎక్కువ నీళ్ళు తాగుతున్నాయి లెండి' అన్నాడు గోవిందప్ప వెటకారంగా.

'కాదు నాయనా! ఎక్కువ త్రాగింది బర్రెలు

కాదు-నువ్వే అని నాకనిపిస్తున్నది. నీకు ఆలోచించుకునే అవకాశం ఈ రోజున లభిస్తుందిలే' అని వెళ్ళిపోయాడు సన్యాసి.

ఆరోజు పాలు అమ్మేశాక, గోవిందప్పకు అనుమానం వచ్చింది: 'ఈ సన్యాసి ఎవడో ఇవాళ్ల నన్ను తిట్టి పోయాడు- ఎందుకైనా మంచిది- ఇవాళ్ళ కొంచెం జాగ్రత్తగా ఉంటాను. వచ్చిన డబ్బుల్ని లెక్కపెట్టుకొని తీసుకెళ్తాను' అనుకున్నాడు. ఆరోజు వచ్చిన నాలుగు వందల రూపాయల్నీ లెక్కపెట్టి సంచిలో వేసుకున్నాడు. యింటికి బయలు దేరాడు.

మధ్యాహ్నం ఎండ చాలా ఎక్కువగా ఉంది. గోవిందప్పకు బాగా దాహం వేసింది. దారిలో చెరువు గట్టున ఉన్నదొక చేద బావి. అక్కడ ఆగి, సంచిని ప్రక్కన పెట్టి, నీళ్ళు చేదుకొని కడుపారా త్రాగాడు. తిరిగి పోదామని చూస్తే సంచి మాయం!

గోవిందప్పకు చాలా బాధ వేసింది. "ఇప్పటికిప్పుడు సంచి ఎట్లా మాయం అవుతుంది? ఇక్కడెవ్వరూ లేరే!"- అని కంగారుగా అంతటా వెతికాడు.

అప్పుడు కనబడింది- కోతి ఒకటి, అతని సంచీని తీసుకొని పోయి, చెట్టుమీద ఎక్కి కూర్చున్నది!

దాన్ని తరిమేందుకు ప్రయత్నించాడు గోవిందప్ప. అది సంచీని పట్టుకొనే చెట్టుమీదినుండి చెట్టుమీదికి దూకటం మొదలుపెట్టింది.



చివరికి అలసిపోయిన గోవిందప్ప నిరాశగా నిల్చుండి పోయాడు. ఇప్పుడు తీరిక దొరికింది కోతికి. అది సంచీలో చెయ్యిపెట్టి,

ఒక్కో నాణాన్నీ దొరకపుచ్చుకొని చెరువులో నీళ్ళలోకి విసిరెయ్యటం మొదలుపెట్టింది.

గోవిందప్ప చూస్తూ ఉండగానే ఒక్కొక్క నాణెమూ చెరువులో కలిసి పోయింది. ఇప్పుడు అతనికి ఏడుపొక్కటే తక్కువ.

నాణాలన్నీ అయిపోయాక, కోతి సంచీని నేలమీదికి విసిరేసి వెళ్ళిపోయింది.

గోవిందప్ప గబగబా వెళ్ళి, సంచీలో చెయ్యిపెట్టి చూసుకున్నాడు. సంచీలో నాణాలు పోయాయి గానీ, నోట్లు అలాగే ఉన్నాయి!

ఆ సంచీని పట్టుకొని అటూ ఇటూ చూడకుండా గబగబా ఇల్లు చేరుకున్నాడతను.

లెక్కపెట్టుకొని చూస్తే అందులో సరిగ్గా రెండు వందల రూపాయలున్నాయి!

అంటే పాల ధర పాళ్లకు, నీళ్ళ ధర నీళ్ళకు వచ్చిందన్నమాట!

మామూలుగా అయితే ఏమీ పట్టించుకునేవాడు కాదు గానీ, ఉదయం సన్యాసి మాటలు విన్నాడు కదా- గోవిందప్ప ఆలోచనలో పడ్డాడు.

ఆ తర్వాత మెల్లగా అతని పాలు చిక్కబడ్డాయి. సన్యాసి మాటలు నిజమయ్యాయి! ✷

పొడుపు కథలు!

3. చీకటింట్లో జడల దయ్యం! అమ్మో, ఏంటది?
4. పచ్చని చెట్టుక్రింద ఎర్రని పెళ్ళి కూతురు! ఎవరట, ఆ పిల్ల?
5. గంపెడు శనగల్లో ఒక రాయి- ఎవరమ్మా అది?
6. ఒక ఇంట్లో 50 మంది దొంగలు! ఎవరు, వాళ్ళు?
7. బట్టలు విడిచి-బావిలో దూకె! ఎవరది?
8. వంద మంది దొంగలకు ఒకడే పోలీసు! ఏమా కథ?



# పిల్లి-ఎలుకల కథ

*కథనం: డి.పవన్‌కల్యాణ్, ఆరవ తరగతి, జిల్లా ప్రజా పరిషత్ సెకండరీ పాఠశాల, తరాలపల్లి, వరంగల్లు జిల్లా*

అనగనగా ఓ అడవిలో చెట్టుక్రింద కలుగులో నివసిస్తూ ఉండేది ఒక ఎలుక. ఒక రోజు సాయంత్రం అది షికారుగా బయటికి వచ్చేసరికి, దూరంగా వలలో చిక్కుకున్న పిల్లి ఒకటి దాని కంట పడింది. ఎలుకకు చాలా సంతోషం వేసింది. దుర్మార్గపు ఈ పిల్లి ఎలుకను తినేందుకు ఎన్ని సార్లు ప్రయత్నించిందో! అట్లాంటి తన శత్రువు వలలో చిక్కుకోవటం చూసి, దాని దగ్గరికెళ్ళి నిలబడి నవ్వుదామనుకొని ముందుకు నడిచింది ఎలుక.

అయితే ఆ సమయానికి అక్కడే దగ్గర్లో ఓ పొదలో పొంచి ఉన్నదొక ముంగిస; ఆ చెట్టు కొమ్మ మీదే కూర్చొని చూస్తున్నది ఒక గుడ్లగూబ!

"వేటగాడు వచ్చి వలలో చిక్కిన పిల్లిని ఎట్లాగూ

చంపేస్తాడు. అప్పుడు తమకు కొన్ని మాంసపు ముక్కలు దొరక్కపోవు!" అని వేచి చూస్తున్నాయి, అవి.

వల దగ్గరికి చేరుకునేవరకూ ముంగిసను, గుడ్లగూబను చూసుకోనేలేదు ఎలుక. తీరా చూసుకునే సరికి బాగా ఆలస్యం అయ్యింది-



ఇప్పుడు అది వెనక్కి తిరిగే వీలు లేదు. వెనక్కి తిరగ్గానే ముంగిస మీద పడుతుంది; గుడ్లగూబ తన్నుకు పోతుంది. ఎలుక ఇరకాటంలో పడిపోయింది.

అంతలోనే దానికొక ఉపాయం తట్టింది- "అడవి పిల్లి అంటే ముంగిసకు, గుడ్లగూబకు చాలా భయం. అది వలలో చిక్కి ఉన్నది కనుక ఇవి ఇక్కడ నిలబడి ఉన్నాయిగానీ, ఒకసారి అది వలలోంచి విడివడిందంటే అవి పారిపోకుండా ఉండవు!"

అందుకని అది ధైర్యంగా వలలో చిక్కుకున్న పిల్లి దగ్గరికెళ్ళి నిలబడింది.

"నన్ను కాపాడు ఎలుకా! ఈ వలను కొరికెయ్యి" అని దాన్ని ప్రార్థించింది వలలో చిక్కినపిల్లి.

"సరేలే, ఆగు" అని వలను కొరుకుతున్నట్లుగా నటించింది ఎలుక. అక్కడక్కడా కొరికేసరికి వల కొంచెం వదులైంది- కానీ ఎక్కడా పిల్లి పట్టేంత పెద్ద రంధ్రం ఏర్పడలేదు. పిల్లి అటూ ఇటూ దూకటం మొదలెట్టేసరికి ముంగిస గుడ్లగూబ వెనుకంజ వేసాయి. పిల్లిని-ఎలుకను జాగ్రత్తగా గమనించటం మొదలుపెట్టాయి. ఎలుక వలను కొరుకుతూనే ఉన్నది ఇంకా-

అంతలో వేటగాడు అటుగా వచ్చాడు. వేటగాడిని చూడగానే పిల్లి అరిచింది- "వచ్చేశాడు, వచ్చేశాడు! కాపాడు! వలను

కొరికెయ్యి- త్వరగా!" అని. అప్పటివరకూ కావాలని ఆలస్యం చేసిన ఎలుక, ఇప్పుడు చటుక్కున వలను పూర్తిగా కొరికేసి, హడావిడిగా తన బొరియవైపుకు పరుగు పెట్టింది.



ఒక్క ఉదుటున బయటికి వచ్చింది పిల్లి. ఇప్పుడు అది ప్రాణ భయంతో ఉన్నది- ఎలుకను పట్టించుకొనే సమయం లేదు. తటాలున అది మరో వైపుకు పరుగు పెట్టింది. వలనుండి విడివడ్డ పిల్లిని చూడగానే గుడ్లగూబ, ముంగిస కూడా తలో దిక్కుకు పారిపోయాయి. ఎలుక సురక్షితంగా బొరియలోకి దూరింది.

మరునాడు ఎలుక ఉండే కలుగు దగ్గరికి వచ్చి నిలబడి, "నిన్న నా ప్రాణాలు కాపాడావు-చాలా కృతజ్ఞతలు. నేను, నా భార్యా బిడ్డలు అందరం నీకోసం ఓ చక్కని విందు ఏర్పాటు చేస్తున్నాం. నువ్వు తప్పకుండా రావాలి" అని ఆహ్వానించింది పిల్లి.

వెంటనే దాని ఆహ్వానాన్ని తిరస్కరించింది ఎలుక- "పిల్లీ! నువ్వూ నేనూ సహజ శత్రువులం. మీ జాతినుండి మాకెప్పుడూ ప్రమాదం ఉంటుంది. ఏదో, పరిస్థితులు అలా ఉండటంవల్ల, నిన్న నేను నీకు సాయం చేశాను; నువ్వు నన్ను తినకుండా వదిలిపెట్టావు. కానీ ఇప్పటి పరిస్థితులు వేరు. ఇప్పుడు నేను నీ ఎదుట పడితే నువ్వు నన్ను తినకుండా ఉండలేవు. నీ సహజగుణం నీది!

నేను నీ ఎదుటికి రాను, క్షమించు" అని మరో అవకాశం ఇవ్వకుండా బొరియ లోపలికి జారుకున్నది.





# ఏం చేస్తారు?

*ఎవరైనా గానీ, ఏం చేస్తారు? అందరూ ఏం చేస్తారోఅదే చేస్తారు మరి! ఇదేంటో తెలుసుకోవాలంటే మజా మజాగా ఉన్న ఈ కథ చదవండి మరి!*

*సేకరణ: సాదినేని తేజ, ఎనిమిదవ తరగతి, ఉషోదయా ఇంగ్లీష్ మీడియం స్కూల్, చౌడవరం, గుంటూరు జిల్లా.*



మగధ రాజ్యానికి ప్రభువు విక్రమ వర్మకి ఒకసారి చాలా ముఖ్యమైన పని పడి దూర ప్రదేశానికి వెళ్లవలసి వచ్చింది. వెళ్ళిన పని పూర్తయ్యాక తిరిగి రాజధానికి వచ్చేటప్పుడు దారిలో ఆయనకు చిన్ననాటి స్నేహితుడొకడు ఎదురయ్యాడు. అతను సామాన్య గృహస్తుడే, అయినా రాజుని ప్రేమగా పలకరించి, "విక్రమా! బాగా చీకటి పడింది. ఇప్పుడు ప్రయాణించాల్సిన అవసరం ఏమున్నది? నీకు అభ్యంతరం లేకపోతే, ఈ రాత్రికి మా ఇంట్లోనే ఉండి, సేదతీరు. తెల్లవారగానే రాజధానికి పోవచ్చులే,

ఏమంటావు?" అన్నాడు.

'సరే' అని విక్రమవర్మ గుర్రాన్ని మిత్రుడి ఇంటి బయటే కట్టివేసి, ఆ రాత్రికి మిత్రుడి ఇంట బస చేశాడు. తెల్లవారాక నిద్రలేచి వచ్చి చూస్తే ఏముంది- గుర్రం కాస్తా మాయం!

మిత్రుడు చిన్నబోయాడు. కానీ ఏం చెయ్యగలడు, పాపం?

రాజుగారు ఊరుకోలేదు. రాజుగారు కద, మరి?! ఊళ్ళోవాళ్లందరినీ ఒకచోట చేర్చారు. "నా గుర్రాన్ని ఎవరైతే తీసుకెళ్ళారో, వాళ్లకు మరొక్క అవకాశం ఇస్తున్నాను- గుర్రాన్ని ఎక్కడినుండైతే విడిపించుకెళ్ళారో దాన్ని అక్కడే-మర్యాదగా- రేపు ఉదయంలోగా- కట్టి పెడితే సరి, లేదంటే గతంలో మా నాన్నగారు ఏ పని చేశారో నేనూ అదే పని చేస్తాను, ఖచ్చితంగా! ఇక దీనికి తిరుగులేదు! నా నిర్ణయం మారదు! గుర్తుంచుకోండి మరి!" అని కరాఖండీగా చెప్పేశారు.

ఊళ్ళోవాళ్ళు అందరూ బెదిరిపోయారు.

గుర్రాన్ని ఎత్తుకెళ్ళిన దొంగవాడు కూడా భయపడిపోయాడు. తను చేసిన పనివల్ల ఊరంతటికీ ఇలాంటి పరిస్థితి ఎదురవుతుందని అతను ఊహించనేలేదు. అందుకని వాడు చడీ చప్పుడు లేకుండా వచ్చి, ఆరోజు రాత్రి గుర్రాన్ని యథాప్రకారం గుంజకు కట్టేసి వెళ్ళిపోయాడు.

తెల్లవారేసరికి గుర్రం గుంజకు కట్టేసి ఉంది.



దాన్ని చూశాక విక్రమవర్మ ముఖం ప్రసన్నమైంది. ఆయన మిత్రుడికి ధన్యవాదాలు చెప్పి, గ్రామస్తులందరికీ చెయ్యిఊపి అభివాదం చేసి, గుర్రం ఎక్కి బయలుదేరబోయారు. అంతలో ఆ ఊరి పెద్ద

ఆయనకు నమస్కరించి "ప్రభూ! మీ గుర్రం దొరికినందుకు చాలా సంతోషం. అయితే మాదొక్క మనవి- పోయిన ఆ గుర్రం గనక దొరక్కపోతే మీ నాన్నగారు గతంలో ఏం చేసారో మీరూ అదే చేస్తామన్నారు- ఇంతకీ గతంలో తమరి తండ్రిగారు ఏం చేశారు ?!" అని అడిగాడు.

"గతంలో ఇలాగే ఓసారి మా నాన్నగారు ఓ ఊళ్ళో బసచేసి ఉండగా ఎవరో ఆయన గుర్రాన్ని దొంగిలించారు. అప్పుడు ఆయన మరొక గుర్రాన్ని డబ్బులు ఇచ్చి కొనుక్కుని రాజధానికి తిరిగి వచ్చారు! గుర్రం తిరిగి ఇవ్వకుంటే నేనూ అదే పని చేసి ఉండేవాడిని!ఇంకేమి!" అని వెళ్ళిపోయారు విక్రమవర్మగారు.

గ్రామస్తులందరూ అవాక్కయ్యారు. తమ రాజుగారి గడుసుదనాన్ని తలచుకొని అనేక తరాలపాటు నవ్వుకున్నారు.

బడికి నడువలేడు, పాఠాలు వినలేడు
చిన్నపద్యమప్పజెప్పలేడు
రాజరాజు బిడ్డరా నేటి విద్యార్థి!
లలిత సుగుణజాల! తెలుగుబాల!

హంసలందు బకము హాస్యాస్పదంబగు
మణుల గాజుపూస గణుతి గనదు
చదువురానిమొద్దు సభల రాణించడు
లలిత సుగుణజాల! తెలుగుబాల!

తెలుగు బాల!

తగిలినంతమేర దహియించుకొని పోవు
చెడ్డవాని చెలిమి చిచ్చువోలె
మంచివాని మైత్రి మలయమారుత వీచి
లలిత సుగుణజాల! తెలుగుబాల!

అందమైన సూక్తి అరుణోదయంబట్లు
బాల మానసముల మేలుకొల్పు
సూక్తిలేని మాట శృతిలేని పాటరా
లలిత సుగుణజాల! తెలుగుబాల!



# ప్రయత్నం-ఫలితం

*'ఫ్యాను' ను ఆధారం చేసుకొని ఒక కథ రాద్దామని ప్రయత్నించారు, ఈ పిల్లలు. తలా ఒక వాక్యం చెప్పుకుంటూ రాస్తే, చక్కని ఈ కథ తయారైంది...*

*రచన: 6,7,10 తరగతుల పిల్లలు, శ్రీ సరస్వతీ శిశు మందిర్, చెన్నూరు, ఆదిలాబాదు జిల్లా.*

రాము వాళ్లది చాలా చిన్న ఇల్లు. ఒకటే గది. ఆ గదిలోనే చాలా సామాగ్రి నిండి ఉండేది. అందులోనే ఒక మూలన పాత ఫ్యాను ఒకటి పడి ఉండేది. దానిని బాగు చేయించాలని రాముకి గట్టి కోరిక. అయితే ఆ పనికి వంద రూపాయలు ఖర్చు అవుతుంది. ఆ డబ్బు దొరికే మార్గం ఒకటి తట్టింది రాముకి.

ప్రతి ఆదివారమూ వాడు ఒక మెకానిక్ దగ్గర పని చేయటం మొదలుపెట్టాడు. ఆ పనికిగాను వాడికి పది రూపాయలు దొరికేవి. ప్రతి వారమూ వాడు తన పది రూపాయలను దాస్తూ వచ్చాడు. నెల తిరిగే సరికి వాడి దగ్గర

నలభై రూపాయలు జమ అయ్యాయి!



అయితే సరిగ్గా అదే సమయానికి వాడు పరీక్ష ఫీజు చెల్లించాల్సి వచ్చింది. దాంతో వాడు సంపాదించిన నలభై రూపాయలూ ఖర్చయిపోయాయి. పని మళ్ళీ మొదటికి వచ్చింది!

అయినా రామూ నిరాశ పడలేదు. ప్రతి ఆదివారమూ మెకానిక్ దగ్గర పని చేస్తూనే వచ్చాడు. ఇంకొక నెల ఇలా జరిగేసరికి మళ్ళీ నలభై రూపాయలు జమ అయ్యాయి. అంతలోనే మరొక కష్టం! రాము వాళ్ళమ్మ ఆరోగ్యం పాడయింది. నలభై రూపాయలూ ఖర్చయిపోయాయి.

అయినా రాము తన పనిని కొనసాగించాడు. మరోనెల గడిచింది. మరొక నలభై రూపాయలు జమ అయ్యాయి. మళ్ళీ ఏదో అవసరం- అవీ ఖర్చయిపోయాయి. ఆరోజు రాత్రి రాముకు నిద్ర పట్టలేదు. ఎన్ని సార్లు ప్రయత్నించినా ఆటంకాలే ఎదురయ్యేసరికి వాడికి చాలా బాధ వేసింది. అయితే అంతలోనే తన సమస్య తీరేందుకు ఒక మార్గం కూడా కనిపించింది.

తెల్లవారగానే వాడు తనే సొంతగా ఫ్యానును విప్పదీసేందుకు పూనుకున్నాడు. మెకానిక్ దుకాణంలో పనిచేసిన అనుభవం అందుకు బాగా తోడ్పడింది. ఫ్యానులో నిజానికి పెద్ద సమస్యలేవీ లేవు. ఒక తీగ కాలి తెగిపోయి ఉన్నది-అంతే. దాన్ని అతికించేసరికి ఫ్యాన్ తిరగటం మొదలుపెట్టింది.

రాముకి చాలా సంతోషం వేసింది. మూడు నెలలు మెకానిక్ దగ్గర పనిచేయటం వృధా పోలేదు. నిజానికి అక్కడ తను సంపాదించింది డబ్బు కాదు-పనిలో నేర్పు. డబ్బులు ఖర్చయిపోయినా ఆ నేర్పు తనకు సహాయపడింది! ✷



# నక్కపిల్ల-కుందేలు

*రచన: కె. హేమంత్ కిషోర్ కుమార్, 9 వ తరగతి, అద్దంకి, ప్రకాశం జిల్లా.*

ఒక అడవిలో ఒక నక్క ఉండేది. దానికి మూడు పిల్లలున్నాయి.

తల్లి నక్క రోజూ తన పిల్లలకి కాసేపు వేట నేర్పించేది. తమకంటే చిన్న జంతువులను ఎలా వేటాడాలో తర్ఫీదు ఇచ్చేది.

ఒకరోజు అది తన పిల్లల్ని వెంట బెట్టుకుని, ఒక చెట్ల గుబురు చాటున మాటు వేసింది.

"అదుగో ఆ పొదలో ఒక కుందేలు వుంటుంది. అది తిండికోసం బయటకు వస్తుంది. అది కనిపించగానే మీలో ఎవరైనా ఒక్కరు-అమాంతం పోయి దాని మీద పడాలి!" పిల్లలతో చెప్పింది తల్లి, నెమ్మదిగా.

"అమ్మా నేనెళ్తానే.... నేనెళ్తానే...." అంటూ ఉత్సాహంగా అరిచింది అన్నింటిలోకీ పెద్ద దైన

నక్కపిల్ల. "సరేలే, నువ్వే ముందు దూకు" అనుమతి ఇచ్చింది తల్లి నక్క . ఇంతలో కుందేలు బయటికి వచ్చింది పొదలోంచి.

దాన్ని చూసీ చూడగానే నక్కపిల్ల అమాంతం ముందుకు ఉరికింది.

అయితే కుందేలు మాత్రం ఏం చిన్నది?! నక్క రాకను పసికట్టనే కట్టింది కుందేలు. నక్కపిల్లకు చిక్కకుండా వాయువేగంతో పరుగు తీసింది.

నక్కపిల్ల దాన్ని వెంబడించింది- కానీ చూస్తూ చూస్తూండగానే అది ఇక నక్కకు అందనంత దూరం వెళ్ళిపోయింది.

ముఖం వేలాడేసుకొని తల్లి దగ్గరి తిరిగి వచ్చింది నక్కపిల్ల.

"ఏంటమ్మా !గొప్ప గొప్పగా కూసి వెళ్ళావు?! ఇప్పుడు ఆ చిట్టి కుందేలు కూడా తప్పించుకుపోయిందా, చేతులు ఊపుకుంటూ వస్తున్నావు?!" మిగతా పిల్లలు దాన్ని వేళాకోళం చేసాయి.

"అమ్మా! నాకు అసలు వేటాడటంరాదేమోనమ్మా, అంత చిన్నకుందేలునుకూడా పట్టలేకపోయాను చూడు!" అవమానం పాలై, అనుమానంతో కన్నీళ్ళు పెట్టుకుంది నక్కపిల్ల. తల్లి నక్క దాన్ని ఓదారుస్తూ అన్నది- "లోపం నీలో లేదు నాయనా! నువ్వు నీ తమాషా కోసం దాని వెనక పరిగెత్తావు. అదేమో తన ప్రాణాలు రక్షించుకునేందుకు పరుగు పెట్టింది.

నిజంగా చూడు- నీ తమాషా కంటే దాని ప్రాణాలు బలమైనవి. అందుకని నీకంటే అదే వేగంగా పారిపోగల్గుతుంది. ఒకసారి నీ కడుపు ఆకలితో మాడిందనుకో, అప్పుడు నువ్వు ఇలాంటి కుందేళ్ళని ఎన్నింటినయినా పట్టగలవు" అన్నది. 

9. దట్టమయిన అడవిలో ఒక రకపు జంతువే! ఏంటది?

10. చూస్తే పొట్టివాడు, ఇంటికి గట్టివాడు! ఎవరు వాడు?!

పొడుపు కథలు!




# లోక కల్యాణం

*సేకరణ: బి.శారద, ఐదవ తరగతి, ZPHS-తలపుల, వరంగల్లు జిల్లా. (పెద్దల సహకారంతో)*
*మార్పు చేర్పులు: కొత్తపల్లి.*

ఓరుగల్లు నగరాన్ని కాకతీయులు పరిపాలించే కాలంలో కడిపికొండ అనే ఊళ్ళో కనకయ్య అనే రైతు ఒకడు ఉండేవాడు.

అతనొకసారి పొలం దున్నుతుంటే నాగలి కర్రుకు ఏదో గట్టిగా తగిలింది. మొదట దాన్ని చూడగానే అదేదో చెట్టు వేరు అనుకున్నాడు కనకయ్య. అతను దాన్ని నరికేందుకు ప్రయత్నిస్తే 'ఖంగు'మని మ్రోత వచ్చింది. చూడగా అదొక లోహ స్తంభం! చాలా లావుగా, బరువుగా, నాలుగు బారల పొడవున, నాలుగు భాగాలుగా, ఉన్నదది! దాన్ని ఎద్దులకు కట్టి, అతి కష్టం మీద బయటికి తీశాడు కనకయ్య . దానికంటిన మట్టిని దులిపి, శుభ్రం చేసి చూడగా అది మామూలు లోహం కాదు- పోతపోసిన అసలు బంగారు స్తంభం అది!

అదే సమయంలో కనకయ్యకు దురాశ పుట్టుకొచ్చింది. స్తంభాన్ని ఇట్లా వెలుగు పొద్దున ఇంటికి తీసుకువెళ్తే అందరూ చూస్తారు! అది తనది- పూర్తిగా తన సొంతం! దాన్ని వేరే ఎవ్వరికీ ఇవ్వకూడదు! రాత్రి బాగా చీకటి పడ్డాక దాన్ని ఇంటికి తీసుకెళ్ళాలి!

అందుకని అతను దానిమీద ఓ పాత కంబళిని కప్పి పెట్టి, ఎప్పటి మాదిరే తన పనిని కొనసాగించాడు. అయితే అతని మనసు ఉరకలు వేస్తున్నది- దాన్ని ఎప్పుడు ఇంటికి తీసుకెళ్దామా అని ఆరాట పడుతున్నది. ధ్యాస అంతా స్తంభం మీద నిలవటం వల్లనేమో, దున్నే పని అంతబాగా సాగలేదు.

అయితేనేమి, ఎట్టకేలకు చీకటి పడింది. స్తంభాన్ని మళ్ళీ ఎద్దులకు కట్టి, లాగమన్నాడు కనకయ్య . పగలంతా పనిచేసి అలిఉన్నందునో, ఏమో- ఎద్దులు ఆ స్తంభాన్ని పిసరంత కూడా కదల్చలేకపోయాయి. రాత్రంతా ప్రయత్నిస్తూనే ఉన్నాడు అతను. మళ్ళీ మళ్ళీ ఎద్దులను స్తంభానికి కట్టి లాగించేందుకు చూశాడు. అయినా ఉదయం మట్టిలోంచి అంత సులభంగా బయటికి వచ్చిన ఆస్తంభం, ఎందుకోమరి, ఇప్పుడు పూర్తిగా మొరాయించింది. ఒక్క ఆవగింజంత కూడా ముందుకి జరగలేదది!

తెల్లవారు జాముకల్లా పూర్తిగా అలసిపోయాడు కనకయ్య. ఉదయించ-బోతున్న సూర్యుడి కిరణాలు ఆకాశంలో తూర్పు దిక్కున పరచుకున్నాయి. ఆ సమయంలో కనకయ్యకు జ్ఞానం ఉదయించింది.



ఈ స్తంభం తనదే అనుకున్నాడు కదూ, తను?! కాదు! నిజానికి జీవితంలో తను

నిర్వర్తించాల్సిన నాలుగు బాధ్యతలకు ప్రతీక ఈ స్తంభం! ఇందులో మొదటి భాగం- తన వృత్తిని చక్కగా కొనసాగించటానికి పెట్టుబడి. రెండో భాగం- తన కుటుంబ అవసరాలను తీర్చేందుకు. మూడవ భాగం తన సంతానపు సంక్షేమం కోసం ఉద్దేశించాల్సినది. ఇక నాలుగవ భాగం లోకకల్యాణంకోసం, ఇతరుల క్షేమంకోసం వాడాల్సినది. మొత్తం తనదే అనుకోవటం ఆశపోతు తనమే- అందుకనేనేమో, పవిత్రమైన ఈ స్థంభం కదలనని మొరాయించింది!

ఒకసారి ఆ అవగాహన వచ్చేసరికి కనకయ్య మనసు తేలికైంది. 'ఎవరైనా చూస్తారేమో' అన్న భయం మాయమైంది. అటుగా వచ్చిన గ్రామస్తులందరినీ సాయానికి రమ్మన్నాడు కనకయ్య. అందరూ కలిసి లాగారు. స్తంభం కదిలింది. ఆనాడు లోకకల్యాణం కోరి కనకయ్య కల్పించిన సౌకర్యాలు కడిపికొండవాసులకు తరగని ఆస్తులై, ఈనాటికీ సేవలందిస్తున్నాయి! ✷

పొడుపు కథలు!

11. తోకలేని పిట్ట- తొంభై ఆమడలు పోతుంది. ఏంటా పిట్ట?!
12. ఒక పెట్టెలో ఇద్దరు దొంగలు! (ఒక్కోసారి ఒక్కరే ఉంటారు, ఒక్కోసారి ముగ్గురూ ఉంటారు!) ఎవరు వాళ్ళు?!
13. శరీరమంతా కళ్ళుంటాయి, చేపను కాదు. పడ్డదాన్ని మటుకు వదలను.. ఎవరు నేను?
14. వెయ్యంగా వెయ్యొస్తది, తియ్యంగా తియ్యరాదు! ఏంటది?
15. తోకతో తీసుకుంటుంది, నోటితో వదులుతుంది! ఏంటది?
16. తెల్లని పొలంలో నల్లని విత్తనాలు! ఏంటవి?
17. అడవిలో పుట్టింది- అడవిలో పెరిగింది- మా యింటికొచ్చింది- తైతక్కలాడింది!
18. ఒక్కదానికి యాభై పళ్ళు! ఏంటది?!

# నీళ్ళ విత్తనం

*సేకరణ, చిత్రాలు: వినయ్, జెయన్‌టీయూ, హైదరాబాదు.*

అనగనగా ఒక రాజ్యంలో విపరీతమైన నీటి సమస్య నెలకొన్నది. ఆ రాజ్యంలోని చెరువులు, నదులు అన్నీ ఎండిపోయి ప్రజలందరూ దాహంతో విలవిలలాడారు. నీటి సమస్యను గురించి రాజుగారితో విన్నవించుకోవాలనుకున్నారు అందరూ.





రాజుగారికి రాజ్యంలోని నీటి సమస్య గురించి పూసగుచ్చినట్లు వివరించారు మంత్రులు.

రాజుగారు సమస్య పరిష్కారం కోసం తీవ్రంగా ఆలోచించారు.





నలుగురు సైనికాధికారులను పిలిచి, రాజ్యం నలుమూలలా నీటికోసం వెతకమని పంపాడు.

సైనికాధికారులు నలుగురూ నాలుగు వైపులకు వెళ్ళారు.





వాళ్లలో ముగ్గురు తిరిగి తిరిగి అలిసిపోయి వెనక్కి తిరిగి వచ్చారు. ఉత్తరానికి వెళ్ళిన నాలుగోవాడు మటుకు పోయి పోయి హిమాలయాలు చేరుకున్నాడు.

అక్కడమంచు కరిగి నీళ్ళు తయారవ్వటం గమనించాడు. 'నీళ్ళు తయారయ్యేది ఈ విత్తనం నుండేనన్నమాట' అనుకున్నాడు.



పెద్ద మంచు కొండనొకదాన్ని పెకలించి, చక్రాల బండి మీదికి ఎక్కించి అతి కష్టం మీద తమ రాజ్యానికి తీసుకు వచ్చాడు. ఆ క్రమంలో మంచు కొండ చాలానే కరిగిపోయింది. చిన్న ముద్ద మాత్రం మిగిలిందిప్పుడు. రాజుగారు దాన్ని చూసి 'ఇది మంచు విత్తనమే. దీన్ని మనరాజ్యంలో నాటండి' అని ఆదేశించారు.

జనాలు మంచుముద్దను ప్రక్కన పెట్టి, నేలను త్రవ్వటం మొదలుపెట్టారు.





వాళ్ళు నేలను త్రవ్వుతూ పోతుంటే, మంచుగడ్డ కరుగుతూ పోయింది.



'విత్తనం మొలకెత్తుతున్నట్లుంది.. త్వరగా నాటండి' అని అందరూ హడావుడి పడ్డారు. అయితే ఆ మంచు గడ్డను గుంతలోకి చేర్చేసరికి అది పూర్తిగా కరిగే పోయింది. త్రవ్వేవాళ్ళు దానికోసం వెతుక్కోవాల్సి వచ్చింది!

'విత్తనం నేలలోకే జారిపోయినట్లుంది. సరిగ్గా కూర్చున్నదోలేదో- త్రవ్వి, దాన్ని తీసి సరిగ్గా కూర్చోబెట్టాలి. ఇంకా త్రవ్వండి' అన్నారంతా. వాళ్లు గుంతను ఇంకా ఇంకా త్రవ్వుతూ పోయారు.





ఎంత త్రవ్వినా, మంచు గడ్డ మాత్రం దొరకనే లేదు.

వాళ్లంతా త్రవ్వీ త్రవ్వీ అలిసిపోయారు. నీరసంగా అక్కడే పడుకొని నిద్రపోయారంతా.

తెల్లవారింది. నీటివిత్తనం నాటేందుకు వెళ్ళిన వాళ్ళు ఎంతకీ తిరిగి రాలేదేమని అక్కడికే వచ్చారు రాజుగారు కూడా. అందరూ గుంతలోకి చూసే సరికి - ఆశ్చర్యం! గుంతంతా నీళ్ళతో నిండిపోయి ఉన్నది!





అందరూ సంతోషంగా కేకలు వేశారు- నీళ్ళవిత్తనం మొలకెత్తిందని గంతులు వేశారు.

రాజ్యంలో నీటి సమస్య తీరింది.

అట్లా ప్రపంచంలో మొదటి బావి తయారైంది.

పొడుపు కథలు

19. ఒక్క గోడకు రెండు వైపులా ఇల్లులు! ఎక్కడ అవి?
20. ఊరంతా తిరుగుతాయి, మూలకు వచ్చి చేరతాయి! ఏంటవి?
21. అమ్మ అంటే కలుస్తాయి, నాన్న అంటే విడిపోతాయి! ఏమిటి?
22. కిటకిట తలుపులు, కిటారు తలుపులు, ఎప్పుడు తెరిచినా చప్పుడు కావు! ఏంటవి?
23. ఇల్లంతా నాకుతుంది. మూలకు చేరి కూర్చుంటుంది. ఏంటది?

ఈ సారి ఇచ్చిన 23 పొడుపు కథల్నీ మనతో పంచుకున్నవారు: శ్రీ సరస్వతీ శిశు మందిర్ పిల్లలు, చెన్నూర్, ఆదిలాబాదు జిల్లా

(- **సమాధానాలు..?** వెతకండి, చివర్లో ఎక్కడో ఉంటాయి!)

# బొమ్మకు కథ రాయండి!

*నిర్వహణ: కొత్తపల్లి*

ఈ బొమ్మను చూడండి:



చిట్టి రాజేష్‌కి ఓ బుజ్జి కుందేలు పిల్ల కనబడింది. ఎక్కడ? ఎప్పుడు? అప్పుడేమైంది?

ఏమో, మీకే తెలిసి ఉంటుంది..! ఊహించండి. ఊహించి, ఆ కథని రాసేసి మాకు పంపించెయ్యండి త్వరగా. బాగుంటే కొత్తపల్లిలో ప్రచురిస్తాం!

మా చిరునామా: కొత్తపల్లి, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515101

ఫోను: 08559240222, 7702877670, ఇ-మెయిలు: team@kottapalli.in



# నాకు?!

*మీకు పెట్టకుండా ఎవరైనా ఏదైనా తింటుంటే మీకేమనిపిస్తుంది? అమ్మో..మాకైతే చాలా బాధ వేసేస్తుంది! అట్లాంటప్పుడు ఏంచేద్దాం, మరి?*

*రచన: శ్రీమతి రాధ మండువ, ఉపాధ్యాయిని, రిషివ్యాలీ స్కూల్, మదనపల్లి, చిత్తూరు జిల్లా.*

తెట్టు గ్రామ పంచాయితీ ప్రెసిడెంట్ జనార్థన స్వామి చాలా మంచివాడు. ప్రజలకి ఉపయోగపడే ఎన్నోపనులు చేస్తూ చుట్టు ప్రక్కల ఉన్న గ్రామాలలో మంచి పేరు సంపాదించుకున్నాడు ఆయన.

ఈ పంచాయితీ పరిధిలోనే ఉన్న పూజారివారి పల్లి అనే చిన్న గ్రామంలో సాంబడు అనే కుర్రవాడు ఉండేవాడు. వాడికి ఒక అవ్వ తప్ప ' నా ' అన్న వారెవ్వరూ లేరు. తల్లిదండ్రులు చిన్నప్పుడే పోవడంతో అవ్వే వాడిని పెంచి పెద్ద చేసింది.

వాడికి ఒక చెడ్డ అలవాటు ఉంది. ఎవరైనా

ఏదైనా తింటుంటే వాళ్ళ దగ్గరకు వెళ్ళి ఆత్రంగా 'నాకు?!" అని చెయ్యి చాపుతాడు. వాళ్ళు తినేదో లేక మరొకటో వాడి చేతిలో పెడితే గాని అక్కడి నుండి వెళ్ళడు. వీడి సంగతి తెలిసిన వారెవ్వరూ వాడికి కనబడేట్లు తినరు. ఈ అలవాటు కారణంగా వాడిని ఎవ్వరూ పనికి కూడా పెట్టుకోవడం లేదు. తెలియని వారు పెట్టుకున్నా త్వరలోనే పనిలో నుండి తీసేసేవారు వాడిని.

అవ్వకు వీడి గురించి పెద్ద బెంగ పట్టుకుంది. "అవ్వా! వీడిని జనార్థన స్వామికి ఒప్పగించి రా! ఆయనకి తప్ప వీడిని భరించడం ఎవరి వల్లా కాదు" అని ఆమెకు సలహా ఇచ్చాడు ప్రక్కింటి రంగయ్య.

అవ్వకు ఆ సలహా నచ్చింది. మర్నాడే తెట్టుకు బయలుదేరింది. జనార్థన స్వామిని కలుసుకుని వీడికున్న అలవాటు గురించీ, దాని వల్ల పని లేకుండా పోవడం గురించి చెప్పుకుంది.

'అది పెద్ద సమస్య కాదు కదా! ఎందుకు పనిలో నుండి తీసివేస్తున్నారు?' అని అనుకుంటూ "నువ్వేం దిగులు పడకు అవ్వా! నా దగ్గర పని చేస్తాడులే" అన్నాడు స్వామి.

మర్నాడు స్వామి కూతురు లక్ష్మి లడ్డు తింటుంటే సాంబడు ఆ అమ్మాయి దగ్గరకు వెళ్ళి ఆత్రంగా "నాకు?!" అని చేయి చాపడం చూసాడు స్వామి. భార్యని పిలిచి "వీడికి కడుపు నిండా అన్నం పెట్టు" అని చెప్పాడు. ఆమె 'వద్దు ఇక చాలు' అనేదాకా అన్నం పెట్టింది వాడికి. ఆ తర్వాత ఏమయిందో తెలుసా? వాడు బయటికి వచ్చి చెయ్యి కడుక్కుంటూ ఇంకా అక్కడే కూర్చుని లడ్డు తింటున్న లక్ష్మి దగ్గరకు మళ్ళీ వెళ్ళి ఆత్రంగా "నాకు?!" అన్నాడు!

'వీడు ఎందుకు అలా అడుగుతున్నాడు? పిండి వంటలు తినాలనుందేమో, వీడికి!' అనుకుని మర్నాడు పిండివంటలతో సుష్టుగా భోజనం పెట్టించాడు స్వామి. భోజనం అయ్యాక చెయ్యి కడుక్కోవడానికి పెరట్లోకెళ్ళిన సాంబడు అక్కడ కూర్చుని అన్నం తింటున్న పాలేరును చూసీ చూడగానే అతని దగ్గరకి ఆత్రంగా పరిగెత్తాడు-

"నాకు?!" అంటూ.

స్వామికి చాలా చిరాకు కలిగింది. ఆ రాత్రంతా సాంబడి గురించిన ఆలోచనతో ఆలస్యంగా నిద్ర పోవడంతో మర్నాడు ఆయనకు తలనొప్పి కూడా వచ్చింది. ఫలహారం అయ్యాక తలనొప్పి మాత్ర వేసుకోవడానికి అక్కడే బల్ల తుడుస్తూ ఉన్న సాంబడిని మంచి నీళ్ళు తెమ్మన్నాడు స్వామి. వాడి చేతిలోనుండి నీళ్ళు తీసుకుని మాత్ర వేసుకోబోతున్న స్వామిని చూసిన సాంబడు "నాకు?!" అంటూ చెయ్యిచాపాడు.

ఫక్కున నవ్వాడు స్వామి. ఆయన చిరాకంతా మాయమైంది. 'వాడికిది కేవలం అలవాటే గాని కోరిక కాదు' అని గ్రహించాడాయన. భార్యతో "వాడు అడిగినప్పుడల్లా ఏదో కాస్త చేతిలోపెడుతుండు" అన్నాడు.

అయితే ఇది పెద్ద సమస్యే అని తరువాత జరిగిన సంఘటనల వల్ల ఆయనకు తెలిసింది.

ఒకరోజు సాంబడు పాలు పిండుతున్నాడు. ఆ సమయంలో పనిమనిషి రంగమ్మ అక్కడకి కొంచెం దూరంలో కూర్చుని చద్దన్నం తినసాగింది.

పాలు పిండుతూ ఎందుకో తల తిప్పిన సాంబడికి ఇది కనిపించగానే పాలగిన్నెను అలానే వదిలేసి 'నాకు?!' అంటూ ఆత్రంగా పరిగెత్తాడు. ఆవు పాలగిన్నెను తన్నేసింది.



ఇంకో రోజు వాడు బావిలో నీళ్ళు తోడుతున్నాడు. అంతలో బ్రష్‌తో పళ్ళు తోముకుంటూ వచ్చాడు స్వామి కొడుకు. వాడిని చూడగానే 'ఏదో తింటున్నాడు' అనుకున్నాడు సాంబడు. చేదను అట్లానే వదిలేసి 'నాకు?!' అంటూ పరిగెత్తాడు!

చివరికి స్వామికో ఉపాయం తట్టింది. భార్యకు, పిల్లలకు, పాలేళ్ళకు తన ఆలోచనను చెప్పాడు. తర్వాతి రోజున మధ్యాహ్నం అయినా స్వామి భార్య సాంబడికి భోజనం పెట్టలేదు. వాడికి ఆకలి దహించుకు-పోతోంది.

వంట ఇంటి దగ్గర తచ్చాడుతున్న వాడిని పిలిచి "ఇంకా వంట అవలేదురా! ఈలోగా ఇది తిను" అంటూ ఒక జిలేబీ ఇచ్చింది ఆవిడ.

వాడు జిలేబీని తింటుండగా స్వామి కొడుకు వచ్చి "నాకు?!" అంటూ చెయ్యి చాపాడు. తత్తరపడిపోయిన సాంబడు తన చేతిలో ఉన్న జిలేబీని వాడికి ఇచ్చేశాడు.

ఇంకో గంట గడిచింది. స్వామి భార్య బయటకు వచ్చి వాడిని చూసి, మళ్ళీ ఇంకో జిలేబీ ఇచ్చింది. ఈసారి స్వామి కూతురు పరిగెత్తుకుంటూ వచ్చి "నాకు?!" అంది చేయి చాపుతూ. పాపం! సాంబడు. అది కూడా ఇచ్చేశాడు. కాసేపాగాక "అమ్మా! ఆకలేస్తుంది " అని కేకేశాడు.

"అయ్యో! ఆకలేస్తుందా! ఇదిగో ఇంకో జిలేబీ తిను" అంటూ స్వామి భార్య మరో జిలేబీని వాడి చేతిలో పెట్టింది. దాన్ని వాడు ఆత్రంగా కొంచెం కొరికేలోపు పాలేరు- "నాకు?!" అంటూ వచ్చాడు.

సాంబడికి ఇప్పుడు చాలా కోపం వచ్చింది. "నేను ఇవ్వను ఫో! నాకు చాలా ఆకలిగా ఉంది! నన్ను అడక్కు!" అన్నాడు.

అప్పుడు అక్కడికి వచ్చిన స్వామి వాడితో "సాంబా! నువ్వు అందరినీ ఇలాగే అడుగుతావు కదా! ఇప్పటికైనా తెలిసిందా? అలా అడిగితే తినేవాళ్ళకు ఎంత బాధ కలుగుతుందో! వాళ్ళకై వాళ్ళు నిన్ను పిలిచి పెడితే తీసుకోవాలి తప్ప, అదే పనిగా అడగకూడదు" అన్నాడు.

సాంబడికి ఇన్నిరోజులూ తను చేసిన తప్పు అర్థం అయింది. కానీ తన అలవాటుని మానుకోవటానికి మటుకు వాడు చాలా కష్టపడవలసి వచ్చింది! 



# దాతృత్వం

*'మంచి పనులు చేసే అవకాశం రావాలంటే మన మనసులో మంచితనం పెరగాలి' అని చెబుతున్నారు రాధిక గారు. నిజమేనంటారా..?*

*రచన: టి.శ్రీవల్లీ రాధిక, హైదరాబాదు.*

పార్వతిని చూస్తే రత్నమాలకి కోపం.

రత్నమాల వాళ్ళు చాలా పెద్ద ఇల్లున్న ధనవంతులు. పార్వతీవాళ్ళు ఆ యింట్లో రెండు చిన్న గదులలో అద్దెకి వుండే పేదవాళ్ళు.

కానీ ఇంటి చుట్టుప్రక్కల వున్నవాళ్ళు అందరూ పార్వతితో చాలా ప్రేమగా మాట్లాడతారు. ఆమె అంటే చాలా గౌరవం చూపిస్తారు. ఏ సహాయం కావాలన్నా రత్నమాలని అడగకుండా పార్వతినే అడుగుతారు.

అందుకే రత్నమాలకి పార్వతి అంటే కోపం. కోపమే కాదు, అసలు అందరూ ఎందుకిలా చేస్తారని ఆశ్చర్యం కూడా.

"ఆవిడ బాగా సహాయం చేస్తుందని ఆవిడని అడుగుతారేమో!" అంటాడు రత్నమాల వాళ్ళ ఆయన.

"మరి నన్ను ఎవరు అడగడమే లేదు కదా! వాళ్ళు అడిగితే కదా నేను సహాయం చేస్తానో చేయనో తెలిసేది!" అంటుంది రత్నమాల.

"పార్వతి దగ్గర పది రూపాయలు కూడా వుండవు. నా దగ్గరేమో యింత డబ్బుంది. ఇన్ని నగలున్నాయి. అయినా అందరూ ఏమన్నా సహాయం కావాలంటే పార్వతి దగ్గరకే వెళ్తారు. నా దగ్గరికి రారు. ఎందుకో తెలీదు." అనుకుంది రత్నమాల ఒక రోజున చిరాకుపడుతూ.

"సహాయమెప్పుడూ దయతో చేయాలి. సహాయం చేయడానికి దయ ముఖ్యం కానీ డబ్బులు కాదు. డబ్బులున్నాయన్న పొగరుతోనో, అందరూ మనల్ని పొగడాలన్న కోరికతోనో సహాయం చేయకూడదు. అది తప్పు." అని వాళ్ళ ఆయన నచ్చచెప్పబోయాడు.

రత్నమాలకి యింకా కోపం వచ్చింది. "మీరు చెప్పేది చాలా బాగుంది. డబ్బుల్లేకుండా దయ మాత్రం వుంటే లాభం ఏముంది?" అంది.

దానికి ఆయన నవ్వి "ఏమో మరి, పెద్దవాళ్ళు చెప్తారు. మంచిపని చేసే అవకాశం అందరికీ రాదుట. మంచి మనసున్నవాళ్ళకే వస్తుందిట." అన్నాడు.



సరిగ్గా అప్పుడే ఎదురుగా వున్న ఖాళీ స్థలంలోని గుడిసెలలో వుండే రంగమ్మ ఓ బిందె పట్టుకుని పార్వతీ వాళ్ళ యింటిలోకి వెళ్ళడం కనిపించింది రత్నమాలకి.

"ఇవాల నీళ్ళటాంకర్ రాలేదమ్మా. ఒక బిందె మంచినీళ్ళిస్తావా!" అని అడిగింది రంగమ్మ

పార్వతిని.

అది విన్న రత్నమాలకి నవ్వొచ్చింది. పార్వతీ వాళ్ళింట్లో ఉన్నదే ఒక బిందె. మంచినీళ్ళు రోజు విడిచి రోజు వస్తాయి కదా! అందుకని వాళ్ళు ఆ ఒక్క బిందె లోను, ఇంకా చిన్న చిన్న గిన్నెలలోను నీళ్ళు పట్టుకుంటారు. ఆ నీళ్ళే రెండు రోజులూ జాగ్రత్తగా వాడుకుంటారు. రత్నమాలేమో నాలుగు బిందెల నిండా, ఇంకా ఓ పెద్ద డ్రమ్ము నిండా నీళ్ళు నింపి పెట్టుకుంటుంది.

అందుకే రత్నమాల 'ఇప్పుడు ఈ పార్వతి ఏంచేస్తుంది? రంగమ్మకి ఏం చెప్తుంది?" అనుకుంది.

పార్వతి రంగమ్మతో అ మాటే చెప్పింది. "సగం బిందెడు నీళ్ళే వున్నాయి రంగమ్మా!" అంది.

"పిల్లలు ఆకలి అంటున్నారు. అన్నం వండుదామంటే అసలు నీళ్ళు లేవు"అంది రంగమ్మ.

"అయ్యో!" అని బాధ పడింది పార్వతి. తన దగ్గర వున్న కాసిని నీళ్ళలోనుంచే కొన్ని తెచ్చి రంగమ్మ బిందెలో పోసింది.

రంగమ్మ అవి తీసుకుని వెళ్ళింది. బియ్యం కడిగి, గుడిసె బయటే వున్న పొయ్యి మీద అన్నం వండడం మొదలుపెట్టింది.

అది చూసి రత్నమాల వాకిట్లోకి వెళ్ళి "రంగమ్మా" అని కేక పెట్టి పిలిచింది. "మంచినీళ్ళు లేవా!" అని అడిగింది.

"లేవమ్మా, పార్వతమ్మ పుణ్యమా అని అన్నం అయితే వండుకున్నాం కానీ, తాగడానికి లేవు" అంది రంగమ్మ.



"మాయింట్లో ఉన్నాయి. కావాలంటే వచ్చి ఒక బిందె తీసుకువెళ్ళు" అని చెప్పి లోపలికి

వచ్చింది రత్నమాల.

'గిన్నెడు నీళ్ళిచ్చిన పార్వతమ్మదే పుణ్యం అయితే ఇప్పుడు నేను బిందెడు నీళ్ళిస్తున్నాను కదా, నాదెంత పుణ్యం!' అనుకుంది. తన గొప్ప చూపించుకునే అవకాశం వచ్చినందుకు రత్నమాలకి చాలా సంతోషంగా అనిపించింది.

బిందె తీసుకుని వస్తున్న రంగమ్మని చూసి, గబగబా తను కూడా లోపలినుంచి నీళ్ళ బిందె పట్టుకొచ్చి వాకిట్లో పెట్టింది.

గేటు దాకా వచ్చింది రంగమ్మ. తలుపు తీసుకుని లోపలికి రాబోయింది. అంతలోనే ఆగిపోయి వెనక్కి పరుగెత్తింది.

ఏమయిందో అర్థం కాక రత్నమాల ఆశ్చర్యంగా బయటికి వచ్చింది. అక్కడ ఆమెకి అపుడే వచ్చి ఆగిన నీళ్ళటాంకర్, అందులోనుంచి నీళ్ళు పట్టుకుంటున్న రంగమ్మా కనిపించారు.

మంచిపని చేసే అవకాశం అందరికీ రాదనీ, అది రావాలంటే ముందు మనం మన మనసులో మంచితనాన్ని పెంచుకోవాలనీ రత్నమాలకి అర్థమయింది. 

**ఎక్కడయినా పర్లేదు!**

నవ్వండి!

ముష్టివాడు: అయ్యా! ఒకపైసా దానం చెయ్యండి బాబు.

బాబు (కోపంగా): నేను రోడ్డుమీద ముష్టివాళ్లకు దానం చెయ్యను!

ముష్టివాడు: అలా అయితే ఇంటి అడ్రసు చెప్పండి సార్.... అక్కడే కలెక్ట్ చేసుకుంటాను

**సులభ మార్గం!**

కొడుకు: నాన్న, మనం త్వరలో ధనవంతులం కాబోతున్నాం.

తండ్రి: నువ్వెలా చెప్పగలుగుతున్నావు?

కొడుకు: రేపు మా టీచర్ పైసలను రూపాయిల్లోకి ఎలా మార్చాలో నేర్పుతానన్నారు.




# పిల్లలూ! పిడుగులూ!

*ఇంకా వేసవి రాకనే ఎండలు మండిపోతున్నాయి ఈ సారి. ఎండాకాలానికి సిద్ధ పడటం అంటే ఏంటి?- ఇదిగో అమ్మమ్మగారు చెప్పిన ఈ కథ చదవండి.*
*రచన: శ్రీమతి ఆదూరి హైమవతి, విశ్రాంత ప్రధానోపాధ్యాయిని.*

వేసవి ఇంకా రాకనే ప్రశాంతిపాలెంలో నీటిఎద్దడి మొదలైంది.

వర్షాభావం వలన నూతుల ఊట సన్నగిల్లింది. చెరువులో నీరు ఇంకిపోయింది. నదిలో సైతం నీరు లేకుండాపోయింది.

గ్రామస్తులందరూ రచ్చబండ దగ్గర చేరి నీటి సమస్య గురించి మాట్లాడుకోడం ఆ గ్రామానికి కొత్తగా వచ్చిన పెద్దపంతులు పెరుమాళ్ళయ్యగారు విన్నారు.

ఆమరునాడు ప్రార్ధనా సమయంలో ఆయన తన బడిపిల్లలని అడిగారు- "పిల్లలూ! మీరంతా ఈరోజు స్నానం చేసి వచ్చారా?"

అని.

"లేదు సార్! మేము వారానికి ఒక్కసారే స్నానం చేసేది- స్నానం చేయను నీళ్ళు లేవుగా!" అన్నారు కొందరు.

"మేము వారానికి రెండుసార్లు స్నానం చేస్తాం సార్!" అన్నారు మరికొందరు.

"మేము రోజూ స్నానం చేస్తాం సార్! మాఇంట్లో బోరు బావి ఉంది " అన్నారు కొద్దిమంది.

"మంచిది పిల్లలూ ! మన ఊళ్ళో ప్రస్తుతం నీటి ఎద్దడి ఉందికదా, అందుకని మనమంతా నీటిని ఎలా పొదుపు చేయాలో ఆలోచించాలి. మీరు రోజూ స్నానం చేసే చెంబులు ఎంతవి ? ఇంత సైజు ఉంటాయా?" అంటూ బడితోటకు నీరుపోసేందుకు గాను తాను తెచ్చిన చెంబును చూపారాయన. పెద్ద కొబ్బరి బోండాం అంత ఉంది అది. దాన్ని చూడగానే పిల్లలంతా "మా ఇంట్లో చెంబు ఇంతదే సార్" అని కొందరూ, "మా చెంబు ఇంకాపెద్దది సార్" అనికొందరూ చెప్పారు.

"సరి సరి. ఈరోజు సూరి ఎందుకు బడికిరాలేదు?" అడిగారు పెద్ద పంతులుగారు.



"వాడికి జ్వరం వచ్చింది సార్! వాళ్ళింటి ప్రక్కనే మురికి కాలవ ఉంది. దాని నిండా దోమలే దోమలు! పాపం, అవి కుట్టినట్టున్నాయి వాడిని. రాత్రి మందుకోసం వాళ్ల అమ్మ వచ్చింది సార్, మా యింటికి" ఆనంద్ చెప్పాడు- వాళ్ల నాన్న ఆ ఊర్లో వైద్యుడు.

"అలాగా ! మరి మనకు వాడుకునేందుకే నీరులేవే! మీలో కొందరు వారానికి ఒక్కసారి, కొందరు వారానికి రెండుసార్లు స్నానాలు

చేస్తున్నారే, మరి అంత నీరు ఎలా చేరుతున్నది, ఆ మురిక్కాలువలోకి? ఆలోచించండి, మనం నీళ్ళని వృధా చేయటం వల్ల, అవి అలా మురిక్కాలవ ల్లోకి పారి, దోమలకు నివాసమై- ....“ అని పంతులుగారు చెబుతుండగానే

“మనకే జ్వరాలు వస్తున్నాయి సార్ !" పూరించాడు వాసు. వాసు చాలా తెలివైనవాడు.

"అవునురా వాసూ! నువ్వు బాగా గ్రహించావు. మన దగ్గర పది బలపాలు ఉన్నాయను-కుందాం. మరి రోజుకో బలపం చొప్పున వాడి పారేస్తే ఏమవుతుంది, చెప్పు?"

“పదిరోజులకు అవన్నీ ఐపోతాయ్ సార్! "

"కదా మరి! మన దగ్గర ఒకసీసాడు మంచినీళ్ళు ఉన్నాయనుకో. నీళ్ళు క్రిందపడిపోయేలాగా, చొక్కా తడిసి-పోయేలాగా ఆ సీసానెత్తి గటగటా నోట్లో పోసుకు త్రాగితే ఏమవుతుంది, చెప్పండి?"

“ఒక్క గంటకే మంచినీళ్ళన్నీ ఐపోతాయి. మధ్దాన్నం బువ్వ తినేటేలకు ఉండవుసార్ ! వాటిని కింద పడ కుండా కొద్ది కొద్దిగా తాగితే, అవి సందేళ వరకూ బద్రంగా ఉంటాయి సార్!”చెప్పింది చెన్నమ్మ.

"కదూ మరి ! మీకు నీళ్ల పొదుపు గురించి బాగానే తెలుసు. ఇప్పుడు మనం మన ఇళ్ళలో నీళ్ళు వాడేటప్పుడు తీసుకోవలసిన జాగ్రత్తల గురించి చెప్పుకుందాం. మీలో ఎవరైతే వీటిని పాటిస్తారో, వాళ్లకి చక్కని కథల పుస్తకాలు బహుమానం. సరా?! మరి వినండి-" అంటూ పంతులుగారు చెప్పిన సంగతులన్నిటినీ శ్రద్ధగా విన్నారు పిల్లలు.

ఆ రోజునుండీ మొదలైంది- ప్రశాంతిపాలెంలో అసలుకథ. పిల్లలే పిడుగులైనారు. పొదుపరి తనానికి పెద్దలైనారు. పెద్దలకే గురువు లైనారు.

ఆ రోజు నుండీ పిల్లలంతా చేరి ప్రతి ఇంటి ముందూ రెండేసి వేప మొక్కలు నాటారు. అప్పటికే వాళ్ళు దాచిపెట్టుకున్న మొత్తానికి పంతులుగారు ఇచ్చిన సొమ్ము కలిపి, అంతా వాళ్ళవాళ్ల ఇళ్ళలో వాడే స్నానం చెంబులు , మంచినీరు త్రాగే లోటాలు- సగం సైజువి-

కొనుక్కొచ్చారు. స్నానపు గదుల వద్ద కాలువలు తీసి, వాడిన నీళ్లన్నీ మొక్కలకు పోయేలా చేశారు:

అమ్మ వంటచేసేప్పుడు దగ్గరుండి " అమ్మా! నువ్వు బియ్యం కడిగిన నీళ్లతోటే పప్పుకూడా కడుగు; ఆ నీళ్లతోనే ఆకుకూరలూ, కూరగాయలూ కూడా కడుగు. వంటగది పక్కనే నేను వేసిన తోటకూర , పుదీనా, బచ్చలి, గోంగూర మొక్కలకు పొయ్యి ఆ నీళ్ళు. నీళ్లను వేటినీ వృధాగా క్రింద పోయనక్కర్లేదు" చెప్పింది పద్మ, వాళ్ళమ్మకు.

"నీకిన్ని విషయాలు ఎలాతెలిశాయి- నాకే పాఠం చెప్తున్నావే!" ఆశ్చర్యంగా అడిగింది పద్మ వాళ్ళ అమ్మ. ఆమె పంచాయితీ ఆఫీస్‌లో గుమాస్తా.

"అమ్మా! బట్టలు ఉతికిన నీళ్ళతోనే స్నానం గది కడిగేసి, ఆ నీళ్లనే పెరట్లో దుమ్ము రేగకుండా చల్లుతాను. నువ్వు ఆ నీళ్లని వృధాగా పారబోయకు" అంది ఆనంది, వాళ్లమ్మతో.

"నాయనా! నువ్వు పొలం నుండి వచ్చాక, మట్టి కాళ్ళు కడుక్కునేందుకు ఒకే చెంబునీళ్లు వాడు. ఈ బండమీద కూర్చుని మెల్లగా కడుక్కో, సరిపోతాయిలే, చూడు" చెప్పాడు నారయ్య, వాళ్ల నాన్నకు.

"నాయనా! స్నానానికి పెద్ద బొక్కెన కాదే, ఈ చిన్న చెంబుతో, చిన్న బొక్కెనన్ని నీళ్ళే వాడాలే! మనింట్లో బోరుబావి ఉందని ఎక్కు వెక్కువ నీళ్ళు వాడితే భూగర్భజలాలు ఇంకిపోతయే ! స్నానం చేయను మామూలు చెంబుతో ఆరు చెంబుల నీరు చాలటనే!" నాన్నకి చెప్పాడు తాతిరెడ్డి.

ఇట్లా పిల్లలంతా పొదుపు పథకాలు అమలుచేసారు. నీళ్లు వృధాకాకుండా, మురికి కాలవ నిండి ప్రవహించకుండా ఆపారు. ఎండి క్రింద పడినవేపాకు తెచ్చి ఇళ్ళముందు మంటలేశారు. వేపనూనెతో దీపాలు వెలిగించారు. మడ్డి, కిరోసిన్, వేప నూనె, ఫినాయిల్ మురికి మీద చిలకరించారు. దాంతో ఊళ్ళో దోమల పోటు తగ్గింది. నీళ్ళను అందరూ పొదుపుగావాడటం వల్ల, క్రమంగా వాడుక నీటి ఇబ్బంది తగ్గింది .

ప్రతి ఇంటిముందూ ఇంకుడు గుంతలు తీసే కార్యక్రమంలో ఊరి జనమంతా పిల్లలకూ, పంతుళ్ళకూ సాయపడ్డారు-



ఎవరి ఇళ్ళల్లో వాళ్ళు ఒక్కరోజులో గుంతలు త్రవ్వారు- వాననీళ్ళు రోడ్లెమ్మట పారి పోకుండా చేశారు. రోడ్ల మీద పడిన నీటిని కాలువలద్వారా చెరువుకు మళ్ళించారు. చెరువు గట్ల మీద పెద్ద మానులయ్యే వేప, చింత, రావి, గంగిరేగి మొక్కలు నాటారు. ఊరు ఊరంతా తలా కొన్నిమొక్కల్ని దత్తత తీసుకుని పెంచసాగింది.

ఇంతలో వేసవి వెళ్ళి వర్షాకాలం వచ్చేసింది.

ఎక్కడపడ్డ చినుకును అక్కడే జాగ్రత్త చేయటం వలన బావుల నిండా నీరు చేరింది; చెరువు అలుగు(మరవ) పారింది; నది నిండుగా ప్రవహించింది. ఆ యేడాది పంటలు చక్కగాపండాయి. రైతుల ముఖాల్లో ఆనందం వెల్లివిరిసింది.

తను అన్న మాట ప్రకారం పెద్ద పంతులుగారు పిల్లలందరికీ కథల పుస్తకాలు బహుమతులుగా ఇచ్చారు!



నవ్వండి!

**భగవంతుని లీల!**

డాక్టర్: డోంట్‌వర్రీ... ఈ జన్మని ప్రసాదించింది భగవంతుడు, అంతా ఆయన చేతుల్లోనే ఉంది, అన్నాడు.

పేషంట్: అయితే, మరి మీ చేతుల్లో ఏముంది?

డాక్టర్: మందులు రాయడం, ఫీజులు వసూలు చేయడం.



# సద్భావన

*రచన: 'వియోగి'- "మామ్మ కథలు"*

*సౌజన్యం: శ్రీ ఎ.వి.యం.*

సత్య జిత్తు చాలా ధనవంతుడు. అతనికి ఇద్దరు కొడుకులు- అజయ్, విజయ్.

'వాళ్ళిద్దరూ జీవితంలో ఎలా పైకి వస్తారు?' అని అతనికి దిగులుగా ఉండేది.

అందుకని ఒకసారి వాళ్ళిద్దరినీ పిలిచి అన్నాడు సత్యజిత్తు- "అబ్బాయిలూ, నేను పెద్దవాణ్ణయ్యాను. ఏవేవో పీడకలలు వస్తున్నాయి. ఇంకా ఒక సంవత్సరం కూడా బ్రతకనేమో అనిపిస్తున్నది. మీ ప్రయోజకత్వం కళ్ళారా చూసి చనిపోవాలని ఉంది. అందుకని మీకిద్దరికీ ఓ పరీక్ష పెడుతున్నాను. ఇందులో నెగ్గిన వారికి మొత్తం ఆస్తిని సంరక్షించే బాధ్యత అప్పగిస్తాను" అని.

"ఏంటా పరీక్ష, నాన్నగారూ?" అడిగాడు

విజయ్.

"ఈ వయసులో మాకు పరీక్షలేంటండీ?!" చికాకు పడ్డాడు అజయ్.

సత్యజిత్తు సైగ చెయ్యగానే, పనివాడు నాగయ్య రెండు కుండలు పట్టుకొచ్చాడు. రెండూ మూతి బిగించి ఉన్నాయి.

"వీటిలో వరహాలున్నాయి. ఆరు నెలల్లో వీటిని రెట్టింపు చేసి నాకు చూపించాలి! ఏం చేస్తారో, ఎక్కడికి వెళతారోమీ ఇష్టం" చెప్పాడు సత్యజిత్తు.

ఇద్దరూ తమ తమ గదులకెళ్ళి కుండలు తెరిచి చూసుకున్నారు.

"అరే! సగం కుండ ఖాళీగానే ఉంది! వరహాలున్నది సగమే- వీటితో నేనేం చెయ్యాలి?!" అజయ్ నిరుత్సాహపడ్డాడు.

"ఓహ్! సగం కుండనిండా వరహాలున్నాయి- ఇంకేమి?! వీటితో ఏదైనా సాధించవచ్చు" అన్నాడు విజయ్ ఉత్సాహంగా.

విజయ్ తూర్పు వైపుకు, అజయ్ పడమటవైపుకు వెళ్ళారు.

విజయ్ పొరుగున ఉన్న నగరానికి చేరుకొని, చిన్న చిల్లరకొట్టు ప్రారంభించాడు. తనకు అంతా మంచే జరుగుతుందన్న విశ్వాసంతో వ్యాపారం చేశాడు. మొదట్లో అతను ఒడుదుడుకులు చాలా ఎదుర్కొనవలసి వచ్చింది. కానీ అతని నిజాయితీ- అతని పట్టుదల క్రమేణా ఆ ఊరి ప్రజలను ఆకర్షించాయి. అతను మెల్లగా వ్యాపారంలో పుంజుకున్నాడు.

ఇక పడమటవైపుకు వెళ్ళిన అజయ్ మరొక నగరం చేరుకున్నాడు. అతనికి ఆ ఊరినిండా మోసగాళ్ళు, దుర్మార్గులు కనిపించారు. వ్యాపారం చేద్దామంటే ఉన్న వరహాలు చాలవని అనుమానం వచ్చింది అజయ్‌కి. ఎలాగో ఒకలాగా చేసినా వ్యాపారం సక్రమంగా జరగదనిపించింది; లాభాలు రావనిపించింది; ఊళ్ళో ఎవరిని నమ్మచ్చో అర్థం కాలేదు.

అందుకని కొన్నాళ్ళు ఆ ఊరి ప్రజలను గమనించాలనుకున్నాడు- ఏ వ్యాపారమూ చేయకుండా ఊరికే అందరినీ విచారిస్తూ కూర్చున్నాడు.

ఒకసారి విజయ్ అతన్ని వెతుక్కుంటూ వచ్చి, అతని సంపాదన ఎంతదాకా వచ్చిందని అడిగాడు.

"సోదరా! ఈ ఊళ్ళో అంతాదొంగలే! ఇక్కడ వ్యాపారం చేస్తే నెత్తిమీద గుడ్డ వేసుకోవాల్సిందే!" చెప్పాడు అజయ్.

"మరి ఇన్నాళ్ళు ఇక్కడ కాలయాపన ఎందుకు చేసావు? వేరే ఊరుకు పోయి ఉండాల్సింది!" సలహా ఇచ్చాడు విజయ్.

"నిజం! నాకు ఆ ఆలోచనే రాలేదు!" ఒప్పుకున్నాడు అజయ్.

వెంటనే మరో ఊరుకు పయనమైపోయాడు.

అక్కడ అందరూ అజయ్‌ని దొంగలా చూడసాగారు. ఏమంటే పొరుగూళ్ళనుండి వచ్చిన వ్యాపారులందరూ స్థానికులను నమ్మించి మోసంచేసి పోయారక్కడ!

అందుకని అతను ఏవ్యాపారం మొదలెడదాం అని చూసినా స్థానికులనుండి వ్యతిరేకత, నిరాదరణ ఎదురయ్యాయి.

అజయ్ మరొక ఊరుకెళ్ళాడు. అక్కడ ప్రజలందరూ బీదవాళ్ళుగా కనిపించారు. అందరూ డబ్బుకు కటకటలాడుతున్నారు. ఎంత వడ్డీకయినా అప్పులు చేసేందుకు సిద్ధంగా ఉన్నారు. వెంటనే అజయ్ వడ్డీ వ్యాపారం ప్రారంభించాడు. అయితే ఎవరిని నమ్మాలో తెలీదు కదా, అందుకని బంగారు నగలు, స్థలాలు, ఇళ్ళు తాకట్టు పెట్టుకోవటం మొదలుపెట్టాడు.

అలా ఆరు నెలల కాలం ముగిసింది.

అజయ్-విజయ్ ఇద్దరూ తండ్రి దగ్గరికి వచ్చారు .

"ఏం సాధించారు?" అని అడిగాడు సత్యజిత్తు ఆతృతతో.

"నాన్నగారు,మీరిచ్చిన వరహాలతో వెచ్చాల వ్యాపారం చేశాను. రెట్టింపు చేశాను- చూడండి" అంటూ విజయ్ తండ్రి ఇచ్చిన కుండ నిండా వరహాలు చూపించాడు.

"నేను వడ్డీ వ్యాపారం చేశాను. మూడు రెట్లు సంపాదిస్తాను-" అంటూ పత్రాలు చూపించాడు అజయ్. "ఇవి తాకట్టు

పెట్టుకున్నాను. గడువులోపు చెల్లించకపోతే ఇవన్నీనా సొంతం. ఇంకో నెలలో ఇవన్నీనావైపోతాయి" చెప్పాడు.

సత్యజిత్తు వాటిని చూడగానే గుర్తించాడు- అవి నకిలీవి! న్యాయస్థానంలో చెల్లవు!

ఈ సంగతి తెలుసుకొని అజయ్ నిశ్చేష్టుడైపోయాడు. "అందుకే, ఏమీ చేయకూడదనుకున్నాను"అన్నాడు.

"అజయ్! నీ దృక్పథం మార్చుకోవాలి. నిరాశతోటీ, నిస్పృహతోటీ జీవితంలో ఏమీ సాధించేది ఉండదు. ఏమీ చెయ్యకుండా ఊరుకోవటంకంటే ఏదో చేసి నష్టపోవటం కూడా మంచిదే! పోయిందేదో పోయింది. మీ అన్న విజయ్ ధీరుడు. అతని సలహాలు తీసుకుంటూ పనిచెయ్యి. స్వతంత్రంగా చెయ్యద్దులే, ప్రస్తుతానికి" అన్నాడు సత్యజిత్తు, అజయ్‌ని మందలించి విజయ్‌కి ఆస్తి బాధ్యతలప్పగిస్తూ.

**ఈ పుస్తకంలోని పొడుపు కథలకు జవాబులు:**

| | | | |
|---|---|---|---|
| 1. పాపడ | 2. మొర్రిపండు గింజ | 3. ఉట్టి | 4. పండు మిరపకాయ |
| 5. చంద్రుడు | 6. అగ్గిపుల్లలు | 7. అరటిపండు | 8. చీపురు |
| 9. పేను | 10. ఉత్తరం | 11. తాళం | 12. వేరు శెనగకాయ (పల్లీ) |
| 13. వల | 14. ముల్లు | 15. దీపం | 16. కాగితం, అక్షరాలు |
| 17. కవ్వం | 18. దువ్వెన | 19. ముక్కు | 20. చెప్పులు |
| 21. పెదవులు | 22. కను రెప్పలు | 23. చీపురు(పరక) | |

*- సరస్వతీ శిశుమందిర్ పిల్లలు, చెన్నూర్, ఆదిలాబాదు జిల్లా*

# మైకెల్ పెర్హాం

యువకెరటాలు

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్*



మైకెల్ పెర్హాం బ్రిటన్ దేశానికి చెందిన ఒక నావికుడు. పదిహేడేళ్ళ వయసులో ఒంటరిగా సముద్రయానం చేసి, ప్రపంచాన్ని చుట్టి వచ్చి రికార్డు సృష్టించాడితను.

మైక్ ఇంగ్లాండ్ దేశంలో 1992 లో పుట్టాడు. వాళ్ళ అమ్మా నాన్నలకు సాహసాలు చేయటమంటే చాలా ఇష్టం. అలా చిన్న మైకెల్‌కి కూడా సాహస యాత్రలంటే ఆసక్తి కలిగింది.

మైక్ వాళ్ళ నాన్న స్వతహాగా నావికుడు. మైక్‌కి ఏడేళ్ళు రాగానే ఆయన పడవ నడపటం ఎలాగో నేర్పించాడు అతనికి. అప్పటినుంచి మైక్ సముద్రంలో ఎక్కడెక్కడో పడవలు నడుపుతూ సాధన చేశాడు. అతనికి పధ్నాలుగేళ్ళు వచ్చేసరికి అట్లాంటిక్ మహాసముద్రాన్ని ఒంటరిగా దాటేశాడు! ప్రపంచంలో ఆ వయసు పిల్లలు ఎవ్వరూ ఈనాటివరకూ ఆ పని చేసి ఉండలేదు! అది మైక్‌పెర్హాం సాధించిన మొదటి ప్రపంచ రికార్డు.

దాంతో అతనికి తన శక్తి సామర్థ్యాలమీద మరింత నమ్మకం కలిగింది. ఈసారి పడవను వేసుకొని ఒంటరిగా ప్రపంచాన్నే చుట్టి రావాలనుకున్నాడు. అతని ఆ ప్రపంచ యాత్రకు అనేక వాణిజ్య సంస్థలు మద్దతునిచ్చాయి. ఈ పర్యటనలో అతను అనేక ఒడిదుడుకులను, చిన్న ప్రమాదాలను కూడా ఎదుర్కొన్నాడు. అన్ని అడ్డంకులనూ అధిగమించి చివరకు సాధించాడు. ప్రపంచాన్ని చుట్టివచ్చిన అతి పిన్న వయస్కుడిగా గిన్నిస్ రికార్డు సృష్టించాడు. ఆ యాత్ర ద్వారా తను సంపాదించిన డబ్బును అతను రెండు సేవా సంస్థలకి అందించాడు.




ఈ ప్రపంచ పర్యటనలో తన అనుభవాలను క్రోడీకరిస్తూ "సెయిలింగ్ ది డ్రీం" అని ఒక పుస్తకం కూడా రాసాడతను. ఈ పుస్తకం రాసేనాటికి అతని వయసు పద్దెనిమిది సంవత్సరాలే! ఈ పుస్తకం ఎంత చక్కగా ఉందంటే, దాన్ని రాసినందుకు కూడా అతనికి మరికొన్ని అవార్డులు వచ్చాయి.

నావికుడిగా సాహస యాత్రలు అంటే ఎంతో శారీరిక, మానసిక శ్రమతో కూడుకున్న వ్యవహారం. వాతావరణం ఎలా ఉంటుందో తెలీదు. సమయానికి తగిన ఆహారం-నీరు ఉంటాయో లేదో తెలీదు. నిద్రపోవడానికి కూడా సమయం ఉండకపోవచ్చు ఒక్కొక్కసారి. అందులోనూ ఒంటరి ప్రయాణాలంటే మరీ కష్టం. ఇదంతా తట్టుకోవడానికి మైక్ తరుచుగా వ్యాయామాలు చేస్తూంటాడు; నిపుణుల సలహాలు తీసుకుంటూ ఉంటాడు. అలాగే, ఆహార విషయంలో జాగ్రత్తలు తీసుకుంటూ, ఎంతో క్రమశిక్షణతో ఉండడం అవసరం అంటాడు.

ఇంతకీ ఇవన్నీ చేస్తూ కూడా అతను చదువు మానలేదు. "నిన్ను ఎవరు ప్రోత్సహించారు?" అని ఓ ఇంటర్వ్యూలో అడిగితే, "మా స్కూలు యాజమాన్యం, కుటుంబ సభ్యులు" అని చెప్పాడు. ప్రస్తుతం మైక్ తమ దేశంలోనే ఒక విశ్వవిద్యాలయంలో టీవీ ప్రొడక్షన్ గురించిన కోర్సు చదువుతున్నాడు. నావికుడిగా తన వ్యాపకం కొనసాగిస్తూనే, సమాజ సేవ కూడా చేయాలి అనుకుంటున్నాడు. తను ప్రయాణించే ప్రతి మైలుకు ఒక బ్రిటీష్ పౌండు డబ్బులు 'షెల్టర్ బాక్స్' అనే ఒక సేవా సంస్థ కు చేరేలా చూడడం అతని ఆశయమట. తన ప్రయాణాల గురించి, సాహసాల గురించి తన ఈడు వారితో పంచుకోవడం అంటే కూడా అతనికి ఇష్టం. వాటి గురించి ఇప్పటికే కొన్ని ప్రసంగాలు, ప్రశ్నోత్తరాల కార్యక్రమాలు కూడా చేసాడు. నౌకాయానమే కాక- పర్వతారోహణ, స్కీయింగ్ వంటి సాహస క్రీడల్లోనూ ప్రావీణ్యత సాధిస్తున్న మైకెల్ పెర్హాం క్రీడాకారులందరికీ స్ఫూర్తి- కదూ? ✸

# దూరంగా ఉన్న కొండ!

*గానం: విజయవాడ బుక్ ఫెయిర్లో హరిచందన, ఎనిమిదవ తరగతి, తేజ విద్యాలయ, నల్గొండ జిల్లా.*

దూరంగా ఉంటుంది ఆ కొండ!

అది ప్రకృతికే అందమిచ్చింది!

అందమిచ్చింది!

అది ప్రకృతికే అందమిచ్చింది!

కొండకోనలతో నిండి ఉన్న

ఆ ప్రకృతినే చూడండి (2)

ప్రకృతినే దేవతలా కొలవండి

మా అమ్మలారా (2)




నాటండి! నాటండి! చెట్లనే నాటండి!

ప్లాస్టిక్కు మానేసి

ప్రాణవాయువునే కాపాడండి!

ఫ్యాక్టరీలంటూ, ఇండస్ట్రీలంటూ

ప్రకృతినే నాశనం చేయకండి(2)

# చిలిపి ప్రశ్నలు-తిక్క జవాబులు

*నిర్వహణ: శ్రీ వి.వి.యస్.మూర్తిగారు, చొదిమెళ్ళ.*

1.జూ అధికారి నూతన దంపతులను ఎలా ఆశీర్వదిస్తాడు?

"చిలకా గోరింకల్లా" వుండండి!!

2.జర్నలిస్టుకి దేవుడు ప్రత్యక్షం అయితే.....?

ఇంటర్వ్యూ చేస్తాడు!!

3.తాజ్ మహల్ ఎక్కడ ఉంది?

జవాబు: కట్టిన చోటే!

4.చలికాలంలో ఐస్క్రీం తింటే ఏమవుతుంది?

జవాబు: కప్పు ఖాళీ అవుతుంది.

5.ఆటలు ఆడని ప్లేయర్?

జవాబు: సీడీ ప్లేయర్!

6.డ్రైవర్ లేని బస్ ?

జవాబు: సిలబస్!

7.రెండు మామిడి పళ్ళను ముగ్గురు పంచుకోవచ్చు. ఎలా?

జవాబు:రసం తీసి!

8.చింటూ చాల్-లేట్ ఇస్తే తినలేదు ఎందుకు?

జవాబు: చాకును ముందిచ్చినా లేటుగా ఇచ్చినా తినలేడుగా!

9. గుడికి వెళ్ళినప్పుడు బొట్టు దేనికి పెట్టుకుంటారు?

జవాబు: నుదుటికి!

10. నాలుకపై పెడతారు గానీ మింగరు.. ఏమిటది?

జవాబు: తపాలా బిళ్ళ!

11. తన పిల్ల కనబడకపోతే కంగారు ఏమని ఏడుస్తుంది?

జవాబు: 'నా జేబు ఎవరో కొట్టేశారు!' అని!

12. దోమ తన పిల్లని సర్కస్ గుడారంలోకి వెళ్ళద్దని చెప్పింది. ఎందుకు?

జవాబు: అందరూ చప్పట్లు కొడతారు కాబట్టి!

13. బస్సులో ఎంతమంది కూర్చోవచ్చు?

జవాబు: పట్టినంత మంది!

14. ఆఫ్రికా గిరిజనులు అరపండు ఎలా తింటారు?

జవాబు: ఒలుచుకొని!

15. ఆ ఇంట్లో బోలెడు డబ్బు నగలున్నాయి. ఒక గజదొంగ ఆ ఇంట్లోకి వెళ్ళాడు. అప్పుడు ఎవరూ లేరు. అయినా అతను ఆ ఇంటిని దోచుకోలేదు ఎందుకు?

జవాబు: అది తన ఇల్లే కాబట్టి!

16. మనిషి కాళ్ళు ఎంత పొడవు ఉండాలి?

జవాబు: నేలకు అందేంత!

**ముద్రిత ప్రతుల వెల:** ప్రతి ఒక్కింటికి: 25 రూ.
12 పుస్తకాలకైచందా: **రూ. 300/-**

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.
బ్యాంకు అక్కౌంటు వివరాలు:
"Kottapalli Trust", A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు
సంపాదకత్వం: నారాయణ
వెబ్సైటు, సాంకేతికత: ఆనంద్, లక్ష్మి
ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు
ముఖచిత్రం: శివరాంప్రసాద్
చిత్రాలు: అడవి, ప్రసాద్, చంద్రకాంత్, లక్ష్మీవెంకట్, వినయ్
కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:** ఉషోదయ-చౌడవరంవారికి, ప్రజ్ఞ-అద్దంకివారికి, అరవిందాహైస్కూల్ వారికి, ప్రభుత్వ ప్రాథమిక-ప్రాథమికోన్నత పాఠశాలలు- తరాలపల్లి వారికి, సరస్వతీ శిశుమందిర్-చెన్నూర్ వారికి, వినయ్- వియోగి గార్లకి, కార్టూనిస్టు ఏవియం గారికి, రాధా రాజశేఖర్ గార్లకి, ఆదూరి హైమవతి గారికి, చిలిపిప్రశ్నలమూర్తిగారికి, కంప్యూటర్లలో లైనక్సు వ్యవస్థను చక్కగా అందిస్తున్న ఉబుంటు వారికి, జింప్, అడాసిటీ తదితర ఓపెన్ సోర్సు సాఫ్టువేరు నిర్మాతలకు, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

పిల్లల్లో సృజనాత్మకత సహజం. కథలు, ఆటలు, పాటలు, బొమ్మలు దానికి ఊతాన్నిస్తాయి. మాతృభాషలో ఇష్టంగా చదవటం, తేలికగా రాయటం వస్తే అటుపైన అన్ని శాస్త్రాలూ సులభంగా వంటపట్టుతాయి-నిజం! అందుకని మీ పిల్లల్లో ఉన్న కాల్పనిక శక్తికి పదును పెట్టండి. వాళ్లను కథలు రాసేందుకు, పాటలు పాడేందుకు, బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించండి. వాళ్ళ రచనల్ని మాకు పంపండి. కావాలనిపిస్తే మీరే ఇలాంటి పత్రికనొకదాన్ని మొదలు పెట్టండి- ఎలాగైనా సరే- పిల్లలు పెద్దవాళ్లయ్యేలోగా వాళ్ళు చాలా చాలా తెలుగు కథల్ని చదివేలా, రాసేలా చేయండి. మీ పిల్లలకు ఈ పత్రికలోని కథలు నచ్చుతాయనే మా నమ్మకం- వీటిని వీలైనంత మందితో పంచుకోండి. మీరు రాసిన పిల్లల కథలు ఏమైనా ఉంటే పనిగట్టుకునైనా సరే, మాకు పంపండి. వీలు చేసుకొని ప్రచురిస్తాం.

**మంచి పుస్తకం:**

## మేధమ్యాజిక్స్

"అమ్మో లెక్కలు! బాబోయ్ !" అనుకునే పిల్లలు ఎక్కువైపోతున్నారు ఈ మధ్య. ఆ భయాన్ని ప్రక్కకు నెట్టేసి "ఆహా! ఓహో!" అనిపించేందుకు కావాలి "మేథమ్యాజిక్కులు". పద్ధెనిమిది రూపాయల ఈ చిట్టి పుస్తకంలో లెక్కల గారడీలు ఒక యాభైపైన ఉన్నై. వాటిని ఒక్కొక్కటిగా సాధన చేస్తూ మిత్రుల మీదా, బంధువుల మీదా ప్రయోగిస్తూ ఎంతటి పిల్లలైనా "వామ్మోపిడుగు!" అనిపించుకునే అవకాశం ఉంది.

"తలనొప్పి దెచ్చు లెక్కల

సులభమ్ముగ లేత మనసు సోకెడి రీతిన్

వెలయించితివి వినోదము

కలగలిపితి వందులోన ఘనుడవు మూర్తీ!" అని కవిరావుగారు రాశారు పుస్తకం వెనక.

నిజమే! నేర్పేవాళ్లకు, లెక్కల్ని ఇష్టపడేవాళ్లకూ, లెక్కలు రాని వాళ్లకూ- అందరికీ నచ్చే పుస్తకం ఇది!




**"మేథ మ్యాజిక్స్, "**

**ఎన్ వి ఆర్ సత్యనారాయణ మూర్తి,**

**విశాలాంధ్ర ప్రచురణ,**

**పేజీలు: 44,**

**వెల: 18 రూ.**



రచయిత గురించి

ఎన్.వి.ఆర్. సత్యనారాయణ మూర్తి, M.A., B.Sc., B.Ed., 25-11-1943న విశాఖపట్నం జిల్లా పెనుగొల్లులో జన్మించారు. వీరు రాసిన కథలు, గేయాలు, వ్యాసాలు 900కు పైగా ప్రసిద్ధ తెలుగు పత్రికలన్నింటిలోనూ ప్రచురింపబడ్డాయి. 1982లో విజయనగరం జిల్లా స్థాయిలోను, 1987లో రాష్ట్ర స్థాయిలోను ఉత్తమ ఉపాధ్యాయునిగా అవార్డులు అందుకున్నారు. 1988లో "బాల సాహిత్యానుస్రష్ట" బిరుదును పొందారు.

వీరు రాసిన గణిత విజ్ఞాన కథలను "మాట్లాడే అంకెలు" అనే పేరుతో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ పుస్తకంగా 1991 నుండీ నాలుగు సార్లు ప్రచురించింది.

ఆకాశవాణి విశాఖపట్నం వారు చిన్నపిల్లలకోసం ప్రసారం చేసిన 'చిలక పలుకులు' కార్యక్రమానికి కొన్ని కథలు, పాటలు రాశారు.

ఆంధ్రపత్రిక వారి బాలరంజనిలో 'గామా' అనే కలంపేరుతో 'అంకెల గారడీ' అనే శీర్షికలో అంకెలలో రకరకాల తమాషాలు తెలియజేశారు.

1990లో వెలువడిన 'రెఫరెన్స్ ఆసియా' పుస్తకంలోనూ, 1994లో వెలువడిన 'ఇండో అమెరికన్ హూ ఈజ్ హూ' పుస్తకంలోనూ వీరి బయోగ్రాఫికల్ నోట్ చోటు చేసుకుంది.

"విశాఖపట్నం కె.సోమేశ్వరరావు సాహితీ ట్రస్ట్" 10-9-1995న వీరికి ఉత్తమ ఉపాధ్యాయునిగా, బాలల కథారచయితగా అవార్డు ప్రదానం చేశారు.

ఆంధ్రప్రభ దినపత్రిక అనుబంధం చిన్నారిలో వీరు రాసిన 'అంకెల వింతలు' సుమారు 200కు పైగా వెలువడ్డాయి.

విజయనగరం జిల్లాలో గణిత ఉపాధ్యాయునిగా ప్రసిద్ధులైన వీరు బొబ్బిలి సంస్థానం ఉన్నత పాఠశాల నుండి ప్రధానోపాధ్యాయునిగా 30-11-2001న పదవీ విరమణ చేశారు.

బొబ్బిలి విజ్ఞాన వివర్ధినీ పరిషత్తు ప్రధాన కార్యదర్శిగా, శ్రీకళాభారతి సాహిత్య విభాగ కార్యదర్శిగా పనిచేశారు. బొబ్బిలి విజ్ఞాన వివర్ధినీ పరిషత్ వారు బాలల కథారచయితగా వీరిని 8-2-97న సన్మానించారు.

బాలల కోసం వీరి రచనలు
వివిధ పత్రికలలో ఇంకా ఎన్నో- ఎన్నెన్నో! ...

## నిలకడ

"మా వాడికి బొత్తిగా నిలకడ లేదండీ" చెప్పాడు సుబ్బారావు.

"అంటే ఎప్పుడూ ఎగురుతూ ఉంటాడా?" అడిగాను.

"అవునండీ, కాలు ఒక చోట నిలవదు".

"మరి నోరు?" అడిగా.

"అయ్యో! ఆ నోటి గురించి ఏం చెప్పాలి? బడబడ వాగుతూనే ఉంటుందెప్పుడూ" అన్నాడు.

"ఓహో! మరైతే ఆకలి బాగానే ఉండి ఉంటుంది" అన్నా.

"అమ్మో! మామూలు ఆకలి కాదు. ఎప్పుడూ ఏదో ఒకటి కరకరా నముల్తూనే ఉంటాడు".

"మరి ఆటలు?"

"ఒకటే ఆడతాడు! ఒకసారి దాగుడు మూతలు, ఒకసారి గోలీలు, ఒకసారి కోతికొమ్మచ్చి, ఓసారి ఇంకేదో, ఓసారి ఇంకేదో. ఆడుతూ ఉండమంటే రోజంతా ఆడతాడు" అన్నాడు సుబ్బారావు.

"ఏమైనా వస్తువులు తయారు చేస్తాడా? రిపేర్లు వగైరాలు?"

"బాగా కనుక్కున్నారు సార్! ఎప్పుడూ ఏదో ఒకటి రిపేరు చేస్తూనే ఉంటాడు. కొత్తగా రోబాట్ బొమ్మ కొనిపెడితే రాత్రికల్లా దాన్ని విరిచి ముక్కలు చేసిపెట్టాడు- లోపల వెలిగే బల్బు ఎలా వెలుగుతుందో చూడాలట!"

"మరి మీ బండి స్పీకర్లనీ వదిలిపెట్టి ఉండడు!" అన్నాను నేను.

"నిజంగానే వదల్లేదు మాస్టారూ! దాన్లో ఎక్కడో ఓ మంచి అయస్కాంతం ఉంటుందట. దాన్ని ఇసకలో దొర్లిస్తే చాలా ఇనప రజను వస్తుందట. ఇనప రజనును అట్టమీద పోసి, క్రింద అయస్కాంతాన్ని కదిలిస్తే చాలట- మహాభారత యుద్ధం కళ్ళముందు కనబడుతుందట!"

"ఓహో, మీవాడికి మహాభారత యుద్ధం కూడా తెలుసా?" అడిగాను నేను ముచ్చట పడుతూ.

"అయ్యో, వాడికి ఉన్నంత కథల పిచ్చి మాకు కూడా ఉండదండీ. ఎప్పుడూ 'కథలు-కథలు' అని వేధించుకు తింటాడు. అప్పటికీ వాళ్ళ అవ్వ ఏవేవో కథలు చెబుతూనే ఉంటుంది. మీకు వాడి గురించి అన్నీ తెలిసినట్లే ఉంది- మా వాడికి కొంచెం మంచి బుద్ధులు ఎలా వస్తాయో చెప్పండి కాస్త! ఏమైనా ధ్యానం నేర్పించమంటారా?"

"వాడికేముందిగానీ, ముందు మీకో మాట చెబుతాను-" అన్నాను.

"చెప్పండి"

"ఏం లేదు, మీవాడిని గురించి చింత పడటం మానెయ్యండి. వాడు చాలా చక్కగా ఎదుగుతున్నాడు- ఇప్పుడే ఏమాత్రం నిలకడ తెప్పించకండి వాడికి. ఇంకొంతకాలం ఇట్లాగే సంతోషంగా ఉండనివ్వండి, పర్లేదు!"

Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP.
Ph:08559 240222 E-mail: team@kottapalli.in and printed at Mudrica Offcet Printers, Vijayawada, Phone:08662579129